# భగవద్గీతాప్రవేశము

[ఇందు సంగ్రహముగా భగవద్గీతాసారమును, సుమారు 150 ముఖ్యశ్లోకములకు ప్రతిపదార్థ తాత్పర్యములును, సాధారణముగా భగవద్గీత చదువునపుడు గల్గు సంశయములను తీర్చు వివరణములను గల్గియున్నది.]


గ్రంథకర్త:

ఆర్షవిద్యాభూషణ

**జటావల్లభుల పురుషోత్తము ఎం. ఏ.,**

సత్యనారాయణపురము, విజయవాడ–2.



తృతీయ ముద్రణము

క్రీ. శ. 1959

శా. శ. 1881




[వెల 2—0—0

# విషయసూచిక

—:o:—


| అధ్యాయ సంఖ్య. | విషయము | | పుట |
|---|---|---|---|
| 1. | అర్జున విషాదయోగము | ... | 1 |
| 2. | సాంఖ్యయోగము | ... | 10 |
| 3. | కర్మయోగము | ... | 28 |
| 4. | జ్ఞానయోగము | ... | 42 |
| 5. | సన్యాసయోగము | ... | 52 |
| 6. | ఆత్మసంయమయోగము | ... | 61 |
| 7. | విజ్ఞానయోగము | ... | 72 |
| 8. | అక్షర బ్రహ్మయోగము | ... | 80 |
| 9. | రాజవిద్యారాజగుహ్యయోగము | ... | 87 |
| 10. | విభూతియోగము | ... | 93 |
| 11. | విశ్వరూప సందర్శనయోగము | ... | 100 |
| 12. | భక్తియోగము | ... | 106 |
| 13. | క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము | ... | 111 |
| 14. | గుణత్రయ విభాగయోగము | ... | 117 |
| 15. | పురుషోత్తమప్రాప్తియోగము | ... | 123 |
| 16. | దైవాసుర సంపద్విభాగయోగము | ... | 129 |
| 17. | శ్రద్ధాత్రయ విభాగయోగము | ... | 135 |
| 18. | మోక్ష సన్యాసయోగము | ... | 139 |

# భగవద్గీతాప్రవేశము

## ప్రథమాధ్యాయము

---

### అర్జున విషాద యోగము

[భారతయుద్ధ వార్తలను ధృతరాష్ట్రునకు చెప్పుటకై వేదవ్యాసులు సంజయుని నియమించిరి. యుద్ధవార్తలను యథాతథముగా గ్రహింపగల్గుటకై సంజయునకు దివ్యదృష్టి నిచ్చిరి.]

ధృతరాష్ట్రుడు సంజయు నిట్లడుగును :

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ కి మకుర్వత సంజయ.

సంజయ, (యుయుత్సవః) యుద్ధము చేయ కోరికగల వారై (ధర్మక్షేత్రే) ధర్మక్షేత్రమైన, (కురుక్షేత్రే) కురు క్షేత్రములో, (సమవేతాః) కూడిన, (మామకాః) నావా రును–దుర్యోధనాదులును – (పాండవాశ్చైవ) పాండవులును, (కిం) ఏమి, (అకుర్వత) చేసిరి?

[యుద్ధముచేయు కోరికగలవారు యుద్ధముచేయుట సహజముగదా! "ఏమిచేసిరని యడుగుటయేల?" అన : వారు చేరినది ధర్మక్షేత్రమగుటచే చిత్తవృత్తి మారి యిరు వురకు సఖ్యము కుదిరియుండవచ్చునని ధృతరాష్ట్రునిభావము;

మఱియు ఈ శ్లోకములో చూపదగిన యొక సూచన నిచట కన్పఱచుచున్నాను : పాపకర్మలుచేయుచో నాశమును (క్షి) పుణ్యకర్మలు చేయుచో రక్షణమును (త్రా) గల్గించునది కాన శరీరమునకు క్షేత్రమను పేరు వచ్చినది. మఱియు దీనిని అధర్మమునకుకాక ధర్మమునకే యుపయోగింపవలయు నను టకు ఇది ధర్మక్షేత్రమని చెప్పబడినది. ఇందు అహంకార మమకారాది రజోగుణతమోగుణములకును (మామకాః), స్వచ్ఛమైన సత్వగుణమునకును (పాండవాః) యుద్ధము జరుగు చుండును. ఈయుద్ధము తగ్గి సత్వగుణమే సంపూర్ణ జయము నొందవలయునన్నచో నిశరీరముతో కర్మయోగము నాచ రించి దీనిని నిష్కామకర్మక్షేత్రముగా (కురుక్షేత్ర) చేసికొన వలయునని భగవానుడు బోధింపనున్నాడు. ఈ యంశము లీశ్లోకములో సూచనామాత్రముగా నున్నవి. ఈశ్లోకము చదువునప్పు డీసూచనను కూడ భావించుకొనుచో గీతాబోధ సంగ్రహముగా మనస్సునకు తట్టు ననుప్రయోజనము నెంచి యీ సూచనను వ్రాసినాను.]

ధృతరాష్ట్రుని ప్రశ్నకు సమాధానముగా సంజయు డిట్లనెను : [ఇది మొదలు ఏతద్గ్రంథాంతము వఱకును గల యంశముల నన్నిటిని సంజయుడు ధృతరాష్ట్రునకు తెలిపెనని గుర్తింపవలయును.]

యుద్ధము ప్రారంభము కానున్న సమయమున అర్జు నుడు కృష్ణసారథికమైన రథముపైనుండి శత్రుసేనను పరికిం

చెను. శత్రుపక్షములో ద్రోణాది గురువులు, భీష్మాది పితామహులు, దుర్యోధనాదిసోదరులు, ఇతర బంధుమిత్రులు ఉండుటనుచూచి అర్జునుడు పరమకృపావిష్టచేతస్కుడై కృష్ణునితో నిట్లనెను.

"నాతో యుద్ధముచేయుటకై వచ్చిన (కృపాగౌరవ పాత్రమైన) స్వజనమును చూడగా నాకు కంపము పుట్టుచున్నది." (28)

శ్లో॥ నకాంక్షే విజయంకృష్ణ న చ రాజ్యం సుఖానిచ
కిం నో రాజ్యేన గోవింద కిం భోగై ర్జీవితేన వా.
యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాస్సుఖానిచ
త ఇమేఽవస్థి తా యుద్ధే ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ.
(32,33)

కృష్ణ! నేను (విజయం) జయమును, (నకాంక్షే) కోరుటలేదు, (రాజ్యంచ) రాజ్యమును, (సుఖానిచ) సుఖములను, కోరుటలేదు–గోవింద, (రాజ్యేన) రాజ్యముచేత, (కిం) ఏమి ప్రయోజనము? (భోగైః) భోగములచేతకాని, (జీవితేన –వా) జీవితముచేతకాని, (కిం) ఏమి ప్రయోజనము?

(యేషాం) ఎవరియొక్క, (అర్థే) నిమిత్తమందు, (నః) మాకు, (రాజ్యం) రాజ్యము, (కాంక్షితం) కోరబడినదో, (భోగాః) భోగములు, (సుఖానిచ) సుఖములు, కోరబడినవో, (తే) ఆ, (ఇమే) వీరు, (ప్రాణాన్) ప్రాణముల యందలి ఆశను, (ధనానిచ) ధనముల యందలి ఆశను, (త్యక్త్వా)

విడచి, (యుద్ధే) యుద్ధమందు, (అవస్థితాః) వచ్చియున్నారు

వీరిని నేను చంపను. వీరే నన్ను చంపిన చంపుదురు గాక! ఆతతాయులైన వీరినిచంపినచో పాపమే వచ్చును. (36)

[ధర్మశాస్త్రమునుబట్టి యాతతాయులను సంహరింప వచ్చును. గురువైనను, బాలుడైనను, వృద్ధుడైనను, బహు శ్రుతుడైన బ్రాహ్మణుడైనను ఆతతాయియై వచ్చుచున్నచో వానిని నిర్విచారముగా సంహరింపవచ్చునని మనుస్మృతి చెప్పుచున్నది.]

శ్లో॥ గురుంవా బాలవృద్ధౌవా బ్రాహ్మణంవా బహుశ్రుతం
ఆతతాయినమాయాన్తంహన్యా దేవాఽవిచారయన్.
(8–350)

గృహములను తగులబెట్టువాడు, విషముపెట్టువాడు, పొలములను, స్త్రీలను హరించువాడు, కత్తిచేతపట్టి చంపుటకు వచ్చువాడు, ధనమును హరించువాడు, వీరు ఆరుగురు ఆతతాయులు.

శ్లో॥ అగ్నిదో గరదశ్చైవ క్షేత్రదారాపహారకః
శస్త్రపాణి ర్ధనాహారీ షడేతే హ్యాతతాయినః.

దుర్యోధనాదులు లాక్షాగృహదహనము గావించినారు; భీమునకు విషము పెట్టినారు; రాజ్యమును కాపట్యముచే హరించినారు; ద్రౌపదికి మానభంగము చేసినారు. కావున ఆతతాయిగణములోనికే వత్తురు. అట్టి దుర్మార్గులను సంహరించుట శాస్త్రీయమేయైనను అర్జునుడు శోక మోహములచేత స్వధర్మమును విస్మరించుచున్నాడు. శోక

మోహావిష్టుడైనవాడు ధర్మమువీడి యధర్మమునకు దిగుట సామాన్యము]

ఓవార్ష్ణేయా, కులములో ధర్మమును నిలబెట్టుటకు సమర్థులైన పెద్దలు కొందఱీయుద్ధములోనికి వచ్చియున్నారు. వీరునశించుచో (కులక్షయే) కులములో ధర్మమును నిలబెట్ట గలపెద్దలు లేకపోవుటచే నితరులు అధర్మపరులగుదురు. 40

స్త్రీలును చెడిపోవుటచే వర్ణసంకరమగును. 41

[సామాన్యమైన అధర్మమొకసారి ప్రబలినను ధార్మికత తిరిగి యేర్పడవచ్చును. కాని స్త్రీలు చెడిపోవుటవలన వర్ణ వర్ణాంతర సాంకర్యము, వర్ణాంతర్గతసాంకర్యము గల్గి యధర్మ సంతానము జనించుటచే శాశ్వతముగనే ధర్మము చెడి పోవును గాన స్త్రీలవిషయము ప్రత్యేకముగా చెప్పబడినది]

దీనివలన పితృదేవతలు పిండోదకములు లేకుండ పతితులగుదురు. 42

[ఈవిధముగా తన కులమే కాక యీ యుద్ధములోనికి వచ్చిన యితరుల కులములుకూడ నశించునని యర్జునుని భయము.]

ఇట్టి యుద్ధము చేసి రాజ్యసుఖములను పొందుటకంటె బిచ్చమెత్తుకొనుట శ్రేయస్కరము. (2-5)

శ్లో॥ కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః

యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నం. (2-7)

(కార్పణ్యదోషోపహతస్వభావః) దైన్యమనెడు కర్తవ్యతామూఢ్యముచే గల్గిన అసమర్థభావమనెడు దోషముచే కొట్టబడిన స్వభావముగల-నేను (ధర్మసమ్మూఢచేతాః) ధర్మవిషయమై మోహము చెందిన మనస్సుగలవాడనై, (త్వాం) నిన్ను, (పృచ్ఛామి) అడుగుచున్నాను, (మే) నాకు,(యత్) ఏది, (శ్రేయః) శ్రేయస్కరమో,-శాశ్వత కల్యాణకరమో (తత్) దానిని, (నిశ్చితం) నిశ్చితమగునట్లుగా, (బ్రూహి) చెప్పుము. (అహం) నేను, (తే) నీకు, (శిష్యః) శిష్యుడను, (ప్రపన్నం) శరణుజొచ్చిన, (మాం) నన్ను (శాధి) శాసింపుము.

[పెద్దలవలన నేర్చుకొనదలచిన వాడిట్లు అహంకారమును వీడుట మిక్కిలి యవశ్యము.]

ఇట్లు పలికి యర్జునుడు నేనుయుద్ధముచేయనని యూరకుండెను.

(ఇంతవఱకును అర్జునుడు పల్కిన మాటలు పైకి బాగుగనే కన్పట్టును కాని విచారింపగా నీక్రింది దోషములు అర్జునుని యీ వాదములో పొడగట్టును:—

1. మానవులకు కర్తవ్యాకర్తవ్య నిర్ణయవిషయములో దారి చూపవలసినది శాస్త్రముకాని తాత్కాలికముగ మనస్సులో నేర్పడిన రాగద్వేషాదులు కావు. శాస్త్రము

ననుసరించి క్షత్రియునకు ధర్మయుద్ధము కర్తవ్యమైయుండగా బంధుత్వాభిమాన మను హృదయదౌర్బల్యము స్వధర్మమును అణచివైచుచున్నది. వర్ణాశ్రమధర్మము లాచరణములో లేని దేశములలో కూడ నర్జునిది యపమార్గమే యగును. మహోన్నతమైన ఆలోచనచేసి యొకపనిని కర్తవ్యముగా నిశ్చయించుకొనినవాడు, ఆ పని చేయవలసివచ్చిన సమయమున ఏ బంధుత్వాభిమానమునకో లోనై యా స్వధర్మమును వీడుట తప్పని యెల్లరు నంగీకరింతురు.

2. అగ్నితో పొగయున్నట్లు ధర్మమును ఆశ్రయించుకొని పాపలేశ ముండవచ్చును. ఈ పాపలేశమునకు జంకి ధర్మనిర్వహణమునుండియే విరమించువాడు ధర్మభ్రష్టుడగును. ఈ ప్రపంచములో ప్రవృత్తి మార్గములో నున్నవాడు ఎప్పటికప్పుడు ఇట్లు ధర్మములను తప్పించుకొనుచుండిన దోషియగును,

3. నాకు రాజ్యాదివాంఛయే లేనిచో యుద్ధముచేయనేల యని యర్జునుడనుటలో భాసించినది యథార్థవైరాగ్యము కాదు. అర్జునునకు యథార్థవైరాగ్యమేయున్నచో బంధుమిత్రాభిమానమును వీడి తన ధర్మమునే నిర్వహించెడివాడు.

[ద్వితీయాధ్యాయములో భగవానుడు చెప్పుసమాధానము నవగాహనము చేసికొనునప్పుడీ పైయంశము గుర్తునందుంచుకొనవలయును.)

[ప్రథమాధ్యాయాంత మందీ క్రింది గద్య ప్రత్యేకముగా కూర్పబడిన భగవద్గీత ప్రతులలో నున్నది. మహాభారతగ్రంథప్రతులలో సాధారణముగా నుండదు.]

"ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అర్జున
విషాదయోగోనామ ప్రథమోఽధ్యాయః"

(ఇతి) ఇట్లు, (భగవద్గీతాసు) కృష్ణరూపుడైన భగవంతునిచే రమ్యముగా చెప్పబడిన, (ఉపనిషత్సు) - ఉపనిషత్తులయందు-వేదాంతర్గతములైన ఉపనిషత్తుల వలెనే యివియు బ్రహ్మతత్త్వము తెలుపునవి యగుటచే లాక్షణికముగా ఉపనిషత్తులని చెప్పబడినవి - (బ్రహ్మవిద్యాయాం) బ్రహ్మవిద్యలోనిదైన (శ్రీకృష్ణార్జునసంవాదే) శ్రీకృష్ణార్జున సంభాషణమే స్వరూపము గాగల, యోగశాస్త్రే యోగశాస్త్రమందు, (అర్జునవిషాదయోగో నామ) అర్జున విషాద యోగమనెడు, (ప్రథమః) మొదటిదైన, (అధ్యాయః) అధ్యాయము, ముగిసెను.

[భగవద్గీతలు యోగశాస్త్రమని యీ క్రిందికారణముచే చెప్పబడినవి. యోగ మనగా కూర్చునది (యుజ్యతే అనే నేతియోగః) 'పరమాత్మతో లేక మోక్షముతో కూర్చు ఉపాయము' అని దీని యర్థము!

పదునెనిమిది యధ్యాయములును పదునెనిమిది సాధనములను (ఉపాయములను) తెలుపుచున్నవి. కావున ప్రతి

యధ్యాయమునకును యోగమను పేరు వాడబడినది. ముఖ్య సాధనములకు అంగములుగా నున్న విషాద యోగములుగానే యిందు వ్యవహరింపబడినవి. ప్రథమాధ్యాయములో వివరింపబడిన అర్జునుని విషాదము వీనిలో నొకటి. విషాదము మోక్ష సాధన మెట్లగు ననగా:- ఈ విషాదస్వరూపమును అవగాహనము చేసికొననిదే దీనికి సమాధానముగా ముందు భగవంతుడు చేయనున్న మహోత్కృష్టోపదేశము బోధపడదు. కావున విషాదముకూడ ఒక యోగముగా చెప్పబడినది. అర్జునునివలె ఆర్తుడై భగవంతుని శరణుజొచ్చినవానిని భగవంతుడనుగ్రహించి యుద్ధరించుననుటయు నిటు గుర్తింపదగినదే.

ఈరీతిగనే రాబోవు అధ్యాయముల యంతమందుగల గద్య నర్థము చేసికొనవలయును.]

—(•••)—

# ద్వితీయాధ్యాయము

## సాంఖ్యయోగము

[సాంఖ్యమనగా పరతత్త్వవిచారము. ఆత్మమాత్రమే నిత్యమైనదనియు, ఆత్మేతరమైన దంతయు అనగా ప్రకృతి (ప్రధానము) అను మూలపదార్థము, దానినుండి వచ్చిన మహత్తు, దానినుండివచ్చిన అహంకారము, మనస్సు, పంచభూతములు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, పంచతన్మాత్రలు అను నీ 24 తత్త్వములునుగూడ అనిత్యమైనవనియు, ప్రకృతి గుణములైన సత్వరజస్తమోగుణములచేతనే లోకమంతయు (సుఖదుఃఖానుభవాదులుగూడ) జరుగుచున్నవనియు, నిరంతరము మారిపోవుచున్న యీ ప్రకృతి అనిత్యమనియు, ఆత్మ నిర్వికారమైనదనియు, ఆనంద స్వరూపమనియు, ప్రకృతిలో నట్టి యానందము లేదనియు ఈ తత్త్వవిచారములోని ముఖ్యాంశములు. భీష్మాదుల శరీరములు ప్రకృతిలోనివేయై నశించుస్వభావము గలవగుటచే నవి నశించునని విచారించుట అవివేకమనియు, తద్దేహాంతర్గతమైన ఆత్మనిత్యమనియు, దానిని చంపుటకు వీలులేదనియు భగవానుడీ యధ్యాయములో నర్జునునకు ప్రధానముగా చెప్పుచున్నాడు. కావున నీ యధ్యాయమునకు సాంఖ్యయోగమను పేరు వచ్చినది. సాంఖ్యశబ్దము 'ఖ్యా' (జ్ఞాపనే) అను

ధాతువునుండి వచ్చినది. ఈ ధాతువునకు బాగుగా తెలుపుట యని యర్థము. కావున బాగుగా తెలుపునది సాంఖ్యమని చెప్పబడును. ఇట్లు దీనికి "పరతత్త్వము తెలుపు విచారము" లేక "జ్ఞానము" అను అర్థము వచ్చినది.

[ఇట్టి విచారదృష్టితో ద్వితీయాధ్యాయములో 11 వ శ్లోకము మొదలు 30 వ శ్లోకమువరకును భీష్మాదుల మరణము దుఃఖింపతగనిది అని భగవానుడు అర్జునునకు నిరూపించు చున్నాడు. ఈ దృష్టితోనే భగవానుడు ముందుగా నేల నిరూపించెనన: తీవ్రవైరాగ్యము గల్గి, ఆత్మాన్వేషణములో పడిన సాంఖ్యులు కర్మలనువీడి సన్యాసము నవలంబింపవచ్చు నను నది శాస్త్రసిద్ధము. అర్జునుడట్టి సాంఖ్యులదృష్టి నవలంబించి వైరాగ్యమునుపూని కర్మత్యాగము చేయదలచినాడు. కాని ఆతని వైరాగ్యము యథార్థమైనది కాదు. ఆతడు పూనదలచిన కర్మసన్యాసము వైరాగ్యమూలకమైనది కానేకాదు; (బంధ్వాది) మమకారంపూర్వకమైనది. ఈ విపరీతవైరాగ్యమును చూచియే భగవానునకు నవ్వువచ్చినది. (11 వ శ్లో) కావున సాంఖ్యదృష్టితో చూచినచో నీవు మరణముపట్ల దుఃఖించుట కెంతమాత్రము వీలులేదని, అర్జునుడు భ్రాంతిలో నవలంబించిన శాఖను భగవానుడు ముందుగా ఛేదించు చున్నాడు.]

అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః॥ 11

ఓ అర్జునా, (త్వం) నీవు, (అశోచ్యాన్) విచారింప కూడని—చావనున్న భీష్మాదులనుగూర్చి (అన్వశోచః) విచారించినావు. (ప్రజ్ఞావాదాన్) జ్ఞానసంబంధమైన మాటలను, (భాషసే) మాట్లాడుచున్నావు. (పండితాః) జ్ఞానులు (గతాసూన్) మృతులను, (పోయిన ప్రాణము గలవారిని) గూర్చియు, (అగతాసూంశ్చ) జీవించియున్నవారినిగూర్చియు, (నానుశోచంతి) దుఃఖింపరు.

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారంయౌవనంజరా
తథా దేహాన్తరప్రాప్తి ర్ధీరస్తత్ర న ముహ్యతి. 13

(దేహినః) దేహములోనున్న ఆత్మకు, (అస్మిన్) ఈ (దేహే) దేహమందు, (కౌమారం) బాల్యము, (యౌవనం) మధ్యావస్థ, (జరా) వార్ధకము అను అవస్థలు (యథా) ఎట్లో, (తథా) అట్లే, (దేహాంతరప్రాప్తిః) మరొక దేహమును పొందుట - మరణమొందుట - ఏవిధమైనవికారమును గల్గింపదు. (తత్ర) ఆవిషయమై, (ధీరః) బుద్ధిమంతుడు (న ముహ్యతి) మోహము చెందడు.

వాసాంసిజీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతినరోఽపరాణి
తథా శరీరాణి విహాయజీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ. 22

(నరః) నరుడు, (జీర్ణాని) చినిగిపోయిన, (వాసాంసి) వస్త్రములను (విహాయ) విడచి, (యథా) ఎట్లు, (నవాని) నూతనములైన (అపరాణి) ఇతరవస్త్రములను (గృహ్ణాతి)

గ్రహించుచున్నాడో, (తథా) అట్లే, (దేహీ) దేహము ధరించిన ఆత్మ, (జీర్ణాని) జీర్ణమైపోయిన, (శరీరాణి) శరీరములను, (విహాయ) విడచి, (అన్యాని) ఇతరదేహములను (సంయాతి) పొందుచున్నాడు.

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవచ
నిత్యస్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః. 24

(అయం) ఈయాత్మ, (అచ్ఛేద్యః) కోయుటకు వీలు లేనిది, (అదాహ్యః) తగులబెట్టుటకు వీలులేనిది, (అక్లేద్యః) తడపుటకు వీలులేనిది, (అశోష్య ఏవచ) వాడింపచేయుటకు వీలులేనిది కూడను, (అయం) ఇది (నిత్యః) ఎల్లప్పుడు నుండునది, (అచలః) చలింపనిది, (సనాతనః) అన్నిటికంటె పురాతనమైనది.

ఈ యాత్మ సర్వగతమయ్యును ఇంద్రియగోచరము కాదు. చింతించుటకు కూడ వీలైనది కాదు. 25

[ఇంతగా దేహాత్మ భేదవిచారము చేయనివానికికూడ మరణము దుఃఖమును గల్గింపవలసిన పనిలేదు. తప్పనిసరిగా జరుగుదానిని గురించి దుఃఖించుట అవివేకము.]

జాతస్యహి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి. 27

(జాతస్య) పుట్టినవానికి, (మృత్యుః) చావు, (ధ్రువో హి) నిశ్చయముకదా (మృతస్య) మృతుడైనవానికి (జన్మ)

తిరిగిపుట్టుట (ధ్రువంహి) నిశ్చితముగదా (తస్మాత్) ఆ హేతువువలన (అపరిహార్యే) పరిహరింపఁజాలని (అర్థే) విషయమందు (త్వం) నీవు, (శోచితుం) దుఃఖించుటకు, (నార్హసి) తగవు.

పై హేతువులచే మరణముపట్ల దుఃఖింపరాదని తేలినది. ఇక మరణాది సమయములలో గల్గు శరీరబాధను, ఇతర బాధలను సహించుట యెట్లో చెప్పవలసియున్నది.

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః
ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత. 14

కౌంతేయ! (మాత్రాస్పర్శాః) ఇంద్రియములకు విషయములతో గల్గు సంపర్కములే, (శీతోష్ణసుఖదుఃఖదాః) శీతము, ఉష్ణము, సుఖము, దుఃఖము, ఇత్యాదులను గల్గించును. ఆసంపర్కములు (ఆగమాపాయినః) రాకపోకలుగలవి (అనిత్యాః) స్థిరమైనవికావు. (తాన్) వానిని (భారత) ఓ భరతకులోద్భవా! (తితిక్షస్వ) సహించుకొనుము.

[త్వగింద్రియమునకు స్పర్శ విషయము; చక్షురింద్రియమునకు రూపము విషయము; జిహ్వకు రసమును, ఘ్రాణమునకు గంధమును, శ్రోత్రమునకు శబ్దమును విషయములు. త్వక్చక్షుర్జిహ్వాఘ్రాణశ్రోత్రేంద్రియములనునవి పంచజ్ఞానేంద్రియములు. శబ్దస్పర్శరూపరసగంధములకే పంచతన్మాత్రలనిపేరు. ఇంద్రియములు పంచభూతవికారములు; విషయములు పంచభూతగుణములు. పృథివ్యప్తేజోవాయ్వాకాశము

లను పంచభూతములలో పృథివికి ఘ్రాణము వికారము, గంధము గుణము; జలమునకు జిహ్వ వికారము, రసముగుణము; అగ్నికి చక్షుస్సు వికారము, రూపము గుణము. వాయువునకు త్వక్కు వికారము, స్పర్శము గుణము; ఆకాశమునకు శ్రోత్రము వికారము, శబ్దము గుణము. ఇంద్రియములకు ఆయావిషయముల సంపర్కముచే గల్గు సుఖదుఃఖములు తాత్కాలికములు, స్థిరుడై, ఆనందరూపుడైన దేహి (ఆత్మ) ప్రకృతిలోవచ్చుచు పోవుచునుండు సుఖదుఃఖములు నావే యని తలచుట అవివేకము. ఈ యవివేకమును వీడినవాడు నిశ్చలమై శాశ్వతమైన ఆనందమును పొందును.]

యంహి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే. 12

(పురుషర్షభ) ఓ పురుషశ్రేష్ఠ! (యం) ఏ, (సమదుఃఖసుఖం) సమానమైన సుఖదుఃఖములు గల, (ధీరం) బుద్ధిమంతుడైన (పురుషం) పురుషుని (ఏతే) ఈ సంపర్కములు, (నవ్యథయంతి) బాధపెట్టవో, (సః) అట్టివాడు, (అమృతత్వాయ) నాశరాహిత్యమునకు, (కల్పతే) సమర్థుడగుచున్నాడు.

[సామాన్యమానవులకందరకును పంచేంద్రియగోచరమైన ప్రపంచ మేవిధముగా కన్పట్టుచున్నదో అంత స్పష్టముగానే ఆత్మజ్ఞానికి ఆత్మ గోచరించును. వానికి ఈ జగమంతయు పరమాత్మ వ్యాపించియున్నట్లు అనుభవమగుచుండును.

పరమాత్మ విషయమై మనకు విశ్వాసము గల్గించుటకు అట్టి మహాపురుషులు చెప్పిన మాటలే హెచ్చు ప్రమాణము, కేవల యుక్తిప్రయుక్తులచేత పరతత్త్వమును తేల్చుకొనుటలో వ్యర్థకాలక్షేపము చేసికొనుటకంటె ప్రత్యక్షముగా దర్శనము చేసినవారు చెప్పు మాటలను నమ్మి మనముకూడ సాధకులమై యా దర్శనము పొందుటకు యత్నించుట వివేకము. ఇతరులను మోసగింపరని యెల్లరును అంగీకరించు అత్యుత్తమశీల సంపన్నులగు మహాత్ములు పరమాత్మ సచ్చిదానందస్వరూపమై సార్వత్రికమై గోచరించుచున్నదని చెప్పుచుండుటచే నట్టివారిమాటను నమ్ముట మూఢవిశ్వాసమనిపించుకొనదు. నవీనప్రకృతివిజ్ఞానములో నొక నూతనాంశమును కనిపెట్టినవాని మాటను నమ్ముట తప్పని సరియగుచున్నది. సమర్థుడై సాధకుడై ప్రయోగముచేసి దాని యాథార్థ్యమును స్వయముగా గుర్తించువాడు తప్ప మిగిలినవారందరు ఆ పరిశోధకుని మాటనే నమ్మి వ్యవహరించుచున్నారు. అట్లే ఆధ్యాత్మికసాధకులు కాగలవారు ఇంద్రియనిగ్రహాదుల నలవఱచుకొని చిరకాలసాధనచే గురుబోధానుసారము పరతత్త్వదర్శనము చేయగల్గుచున్నను, అంత సాధన చేయలేనివారట్టి విశ్వాసమునే గల్గియుండుట సంభవించుచున్నది. అది మూఢవిశ్వాస మనిపించుకొనదు; ప్రామాణ్యబుద్ధి యనిపించుకొనును. భారతదేశసౌభాగ్యము వలన నీ యిరువదవ శతాబ్దిలోకూడ ఆత్మదర్శనము చేసినవారు కొందరిచట

కలరు. ఇట్టివా రితరదేశములలో నున్నట్లు కన్పట్టదు. వారు లోకమును మోసగించు మాటలను చెప్పుచున్నారనుటకెవ్వరికిని సాహసముండదు. అట్లే గీతలలోని మన యనుభవమునకతీతమైన మహత్తర విషయములను ప్రత్యక్షముగా అనుభవించుటకై తగిన తీవ్రసాధనల నవలంబింపజాలనివారు ప్రామాణ్యబుద్ధిగల్గి క్రమాభ్యాసమును చేయుచుండవలయును.]

[ఇంతవరకును భగవానుడు చెప్పినదానినిబట్టి యెవడైనను మృతుడైనచో విచారింపరాదని తేలినదేకాని యీ యుద్ధములో శత్రుసంహారము చేయవచ్చునని తేలలేదు. భగవానుడు ద్రోణాదులు మరణింతురను విచారమును అర్జునుని హృదయమునుండి తొలగించెను. ఇక అర్జును డేల ఈ యుద్ధములో పాల్గొనవలయునో భగవానుడు చెప్పుచున్నాడు. దాని గమనిక యెట్టిదనిన: అర్జునుడు క్షత్రియుడై జన్మించెను. వానికి ధర్మయుద్ధము కర్తవ్యము. ధర్మమును పాటించువానికి స్వర్గముగల్గును, మంచి జన్మలు వచ్చును; ఈ జన్మమున సత్ఫలముకూడ రావచ్చును. కాని యీస్వర్గాదులవలన గల్గు సుఖము కొంతకాలముమాత్రమే యుండును. స్వర్గాదులను కోరి కర్మల చేయువారికి సకామకర్ములని పేరు. శాశ్వతమైన బ్రహ్మానందము రావలయునన్నచో నీస్వర్గాదులను కోరకుండ ఆ ధర్మమునే నిష్కామముగా ఈశ్వరార్పణబుద్ధితో నాచ

రింపవలయును. ఈ మార్గమునకే కర్మయోగమని పేరు. సకామకర్మ చేయువాని మనస్సు నిరంతరము పలుకోర్కెలు గలదై విశ్రాంతిలేకయుండును; వారికి సుఖదుఃఖములవలన ఆందోళనము గల్గుచుండును. నిష్కామకర్మచేయువాడేకర్మ చేసినను ఈశ్వరానుగ్రహమను ఏకైకోద్దేశముతో చేయును. దీనివలన వానిబుద్ధికి నిలకడ యేర్పడును; క్రమముగా పూర్ణమైన కామరాహిత్యము గల్గును ఈ విధముగా శుద్ధమైన అంతఃకరణము గలవానిలో ఆత్మజ్ఞానము నిర్నిరోధమై ప్రకాశించును. కావున నిష్కామకర్మాచరణము క్రమముగా పైని వర్ణింపబడిన పరతత్త్వ దృష్టికి దారితీయును. ఈనిష్కామ కర్మచేయువాడు సుఖదుఃఖములను లాభాలాభములను లెక్కచేయక యీశ్వరానుగ్రహమునకై చేయుట వాస్తవమేగాని, వాడు చేయు కర్మ ధర్మవిరుద్ధమై యుండరాదు. వాడును సకామకర్మనివలెనే స్వధర్మమును వీడరాదు.]

స్వధర్మమపి చావేక్ష్య న వికంపితు మర్హసి
ధర్మ్యాద్ధియుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే.31

(స్వధర్మం) నీధర్మమును, (అవేక్ష్యాపి) చూచినైనను, (వికంపితుం) చలించుటకొఱకు, (నార్హసి) తగవు; (క్షత్రియస్య) క్షత్రియునకు, (ధర్మ్యాత్) ధర్మబద్ధమైన (యుద్ధాత్) యుద్ధముకంటె, (అన్యత్) మఱొకటి, (శ్రేయః) శ్రేయస్కరమైనది, (నవిద్యతే) లేదు.

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ

తతోయుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి. 38

(లాభాలాభౌ) లాభాలాభములను, (జయాజయౌ) జయాజయములను, (సుఖదుఃఖే) సుఖదుఃఖములను, (సమే) సమమైనవానినిగా (కృత్వా) చేసి-భావించి-(తతః) పిమ్మట, (యుద్ధాయ) యుద్ధముకొఱకు (యుజస్వ) సిద్ధమగుము, (ఏవం) ఈప్రకారముగా, (పాపం) పాపమును, (నావాప్స్యసి) పొందవు-ధర్మము నాశ్రయించుకొని సహజముగా నున్న పాపలేశము నిష్కామకర్మయోగి నంటదు.

[సకామకర్మను ప్రారంభించి మానివైచినచో ఫలము గలగదు. నిష్కామకర్మ యేకొలదిగ చేసినను ఫలించును. సకామకర్మలోపొరపాటువలన వ్యతిరేక ఫలమునచ్చును. నిష్కామకర్మలో నట్లు ప్రత్యవాయము రాదు. మంత్రజపాదులను కూడ సకామముగా చేయునప్పుడు నియమములు హెచ్చు. నిష్కామముగా చేయునప్పుడు నియమములు తక్కువ.]

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయోన విద్యతే
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతోభయాత్. 40

(ఇహ) ఈకర్మయోగములో (అభిక్రమనాశః) ప్రారంభింపబడినదానికి భంగము, (న) లేదు. (ప్రత్యవాయః) వ్యతిరేకఫలము (న)లేదు. (అస్య) ఈ, (ధర్మస్య)నిష్కామధర్మము యొక్క, (స్వల్పమపి) కొలదిభాగమైనను, (మహతః) గొప్పదైన, (భయాత్) భయమునుండి, (త్రాయతే)రక్షించును.40

[ఎట్లన : సకామకర్మలో స్వర్గాదులు, ఐశ్వర్యాదులు కోరికనుబట్టి లభించునట్లే, నిష్కామకర్మకు మరొకవిధమైన ఫలమునచ్చును. ప్రయత్నించి ఏకనాడు కొంచెము నిష్కామ కర్మ చేయుచో దానికి ఫలితముగా పరమేశ్వరుడు ఇంకను కొంత నిష్కామకర్మచేయు సద్బుద్ధిని పుట్టించును. అట్లు మరల చేయుచో దానివలన మరింత నిష్కామత్వము దృఢ పడును. ఇట్లు కొలదిగా ప్రారంభించినను నిష్కామకర్మ క్రమాభివృద్ధి నొంది తామరతంపరయై కామమును నశింప చేసి యంతఃకరణ శుద్ధిని,జ్ఞానమును గల్గించి సంసారభయము నుండి కాపాడి మోక్షమిచ్చును; ఈ నిష్కామకర్మలో బుద్ధిని నిలకడలోనుంచు శక్తిగలదు. అట్లే స్థిరబుద్ధిలో నిష్కామ కర్మను చేయించు శక్తిగలదు. ఇవి ఒకదానికొకటి తోడ్పడు చుండును.]

వ్యవసాయాత్మికాబుద్ధి రేకేహ కురునందన
బహుశాఖాహ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినాం. 41

కురునందన, (ఇహ) ఈ కర్మయోగమార్గములో (వ్యవసాయాత్మికా) నిశ్చయమే స్వభావముగాగల, (బుద్ధిః) బుద్ధి, (ఏకైన) ఒకేరీతిగానే యుండును–అనేక వాంఛలు లేకపోవుటచే బుద్ధి నిలకడగా నుండును. (అవ్యవసాయినాం) నిశ్చయము లేనివారియొక్క – బహు కామములుగల వారి యొక్క (బుద్ధయః) బుద్ధులు, (బహుశాఖాః) అనేకములైన

శాఖలుగలవి - పలు తెఱగుల పరుగిడుచుండును. (అనంతాః) అంతములేనివి.

[కావున, ఓయర్జునా, నీవు నిష్కామకర్మాభ్యాసముచే బుద్ధిని నిశ్చలము గావించుకొనుము. సుఖదుఃఖముల యందు ఒకేరీతిగా నుండుట యోగమని చెప్పబడును. అట్లుండి కర్మలను చేయుటయే కర్మయోగము.]

యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. 48

ధనంజయ! (యోగస్థః) యోగమందున్నవాడవై, (సంగం) ఫలాసక్తిని, (త్యక్త్వా) విడచి-తుదకు జ్ఞానప్రాప్తి విషయములోకూడ ఇంకను జ్ఞానముగలుగలేదను ఆందోళనము చెందక-(సిద్ధ్యసిద్ధ్యోః) నెఱవేరుటయందును, నెఱవేరక పోవుటయందును, (సమోభూత్వా) ఒకరీతిగానున్నవాడవై, (కర్మాణి) కర్మలను, (కురు) చేయుము, సమత్వం (సుఖదుఃఖాదులయందు) ఒకేరీతిగానుండుట, (యోగః) యోగమని (ఉచ్యతే) చెప్పబడును.

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలం. 50

(బుద్ధియుక్తః) సమబుద్ధితో కూడుకొన్నవాడు (ఇహ) లోకములో, (సుకృతదుష్కృతే) పుణ్యపాపములను, (ఉభే) రెంటిని, (జహాతి) విడిచిపెట్టుచున్నాడు, (వానికి జ్ఞానముగల్గును గావున జ్ఞానము కర్మలను నాశనముచేసి మోక్షమి

చ్చును.) (తస్మాత్) ఆహేతువువలన, (యోగాయ) (సమ బుద్ధి యని చెప్పదగిన (యీ) యోగముకొఱకు, (యుజ్యస్వ) సిద్ధపడుము, (కర్మసు) పనులయందలి, (కౌశలం) నేర్పరి తనము, (యోగః) యోగమని చెప్పబడును. అనగా, లాభా లాభములను పుణ్యాపాపములును, సుఖదుఃఖములును, అంట కుండునట్లు కర్మలను సమబుద్ధితో చేయుటయే కర్మలయం దలి నేర్పరితనము.

[సమత్వమే యోగమని చెప్పిన దానికిని కర్మలను చేయుటలోని నేర్పరితనమే యోగమని యిచ్చట చెప్పిన దానికిని భేదమేమియు లేదని యీరీతిగా గుర్తింపవలయును.]

[ఇట్లు చేయుటవలన నేమి సిద్ధించునన :]

కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్ 51

(బుద్ధియుక్తాః) సమబుద్ధితో కూడికొన్న, (మనీషిణః) జ్ఞానులు, (కర్మజం) కర్మవలనవచ్చు, (ఫలం) ఫలమును, (త్యక్త్వా) విడిచిపెట్టి, (జన్మబంధ వినిర్ముక్తాః) జన్మయనెడు బంధముచేత విడువబడినవారై, (అనామయం) ఏయుపద్రవ మును లేని, (పదం) నా స్థానమును-మోక్షమును-(గచ్ఛంతి) పొందుదురు.

[ఇట్లు నిష్కామకర్మాచరణముచే అంతఃకరణశుద్ధియు, జ్ఞానమును, తుదకు మోక్షమును సిద్ధించును. కావున జ్ఞాన

ప్రాపకమైన అంతఃకరణశుద్ధి కలుగవలసిన అర్జునునివంటివాడు తప్పక కర్మలను నిష్కామముగా చేయవలయును.]

ఎంత నిష్కామముగా చేయబడినను జడమైన కర్మ జ్ఞానమును గల్గింపజాలదు. కాని అంతఃకరణములో నున్న మాలిన్యము పోగొట్టగలదు. దీపముచుట్టు మసితోకూడిన చిమ్నీయున్నచో దీపము ప్రకాశింపదు. దీపము ప్రకాశింపవలయునన్నచో దీపమున కేమియు సంస్కారము చేయ నక్కఱలేదు. అది యేచిమ్నీగుండ ప్రకాశించుచున్నదో ఆ చిమ్నీకి సంస్కారము చేయవలయును. అట్లే జ్ఞానస్వరూప పము ప్రకాశింపవలయు నన్నచో ఆత్మకేమియు సంస్కార మక్కఱలేదు. దాని నావరించుకొనియున్న యంతఃకరణమును సంస్కరింపవలయును. ఈశ్వరార్పణ బుద్ధితో చిరకాలము కర్మలు చేయగా చేయగా అంతఃకరణములోని రాగద్వేషాది మాలిన్యము నశించును. అప్పుడు జ్ఞానము ప్రకాశించును. వ్యావహారిక భాషలో దానినే "జ్ఞానోదయ" మందురు.

కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి. 47

(తే) నీకు, (కర్మణ్యేవ,) కర్మ చేయుటయందే, (అధికారః) అధికారము గలదు, (ఫలేషు) కర్మఫలములయందు. (కదాచన) ఎప్పుడును, (మాస్తు) అధికారము లేకుండుగాక, -అది నాయధీనములో నుండును - (కర్మఫలహేతుః) కర్మ ఫలమునకు - తిరిగి జన్మాదులు కలుగుటకు - కారణమవు,

(మాభూః) కావద్దు, (తే) నీకు, (అకర్మణి) పని చేయకపో వుటయందు, (సంగః) ఆసక్తి, (మాస్తు) లేకుండుగాక!

[పైని తెలిపిన రీతిగా నెవని బుద్ధి పలు రీతులుగా పోక నిశ్చలముగా నుండునో వానిని స్థితప్రజ్ఞు డందురు. కర్మయోగము ప్రారంభించినపు డీ బుద్ధి నిష్కామత్వమందు- అనగా ఈశ్వరానుగ్రహ మను ఏకైక లక్ష్యమం దుండును. ఈశ్వరానుగ్రహము ప్రాప్తించుచున్న కొలదియు వాని బుద్ధి ఆత్మజ్ఞానములో రూఢమగుచుండును. ఏనాడు నిష్కామ కర్మ యోగము పూర్తిగా ఫలించునో ఆనాడు వాని ప్రజ్ఞ (బుద్ధి) పరమాత్మయందే పూర్ణముగా లగ్నమగును.]

అట్టి స్థితప్రజ్ఞునిలక్షణము లెవ్వియని యర్జును డడుగును. 54

భగవంతుడు స్థితప్రజ్ఞు నిట్లు వర్ణించుచున్నాడు:-

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే. 55

పార్థ! మానవుడు (యదా) ఎప్పుడు, (మనోగతాన్) మనస్సులోనున్న (సర్వాన్) సమస్తమైన (కామాన్) కోరి కలను, (ప్రజహాతి) విడచునో, (ఆత్మనైవ) తనచేతనే, (ఆత్మని)ఆత్మయందు,(తుష్టః) సంతుష్టుడైయుండునో, (తదా) అప్పుడు, వాడు, (స్థితప్రజ్ఞః) స్థితప్రజ్ఞుడుగా - నిశ్చలమైన జ్ఞానముగలవాడుగా (ఉచ్యతే) చెప్పబడును.

[బాహ్యవస్తువులను అనుభవించుటవలనగాని, వానిని గూర్చి ఆలోచించుటవలనగాని లోకులు సుఖదుఃఖములను

పొందుదురు. కాని స్థితప్రజ్ఞుడు బాహ్యవస్తుసంపర్కము లేకుండ తనలోనే ఆత్మానందము ననుభవించును.

[ఆతడు విషయసుఖములయందు తృష్ణలేక, దుఃఖముల యందు క్షోభము లేక యుండును. ఆతనికి రాగము, భయము, క్రోధము ఉండవు. 56 తాబేలు తన అంగములను ఉపసంహరించుకొను నట్లాతడు తన యింద్రియములను విషయములనుండి ఉపసంహరించును. 58 ఈ యుపసంహారము అభ్యాసమువలన జరుగవలసినదే కాని ఇంద్రియములను ఉపవాసాదులచే దుర్బలములుగా చేసికొనుటవలన జరుగదు. 59 ఇంద్రియములను స్వేచ్ఛగా వదలరాదు. 61 విషయములను గురించి యాలోచింప వానిపై నాసక్తి కల్గును. దానివలన అవి కావలయునను కోరిక గల్గును. కోరికను అడ్డువానిపై క్రోధము వచ్చును. 62 క్రోధమువలన అవివేకము గల్గును; దానివలన అదివఱకు నేర్చిన ఉపదేశములు మరపునకు వచ్చును; దానివలన బుద్ధినాశము గల్గును. బుద్ధి నాశము వలన మానవుడు నశించును. 63

కావున ఇంద్రియములను నిగ్రహించి యీశ్వరార్పణ బుద్ధితో కర్మలను చేసి స్థిరప్రజ్ఞను సంపాదించుకొనవలయును. స్థిరప్రజ్ఞను సంపాదించుకొన్న మహానుభావుని లోకోత్తర జీవితము అత్యంత రమణీయాలంకార ధ్వనిశోభితమైన యీ క్రింది శ్లోకములో వర్ణింపబడినది.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః. 69

(యా) ఏది, (సర్వభూతానాం) సర్వభూతములకు, (నిశా) రాత్రియో, (తస్యాం) దానియందు, (సంయమీ) జితేంద్రియుడైన యోగి, (జాగర్తి) మేల్కొనును.(యస్యాం) దేనియందు, (భూతాని) భూతములు, (జాగ్రతి) మేల్కొను చున్నవో, (సా) అది, (పశ్యతః) చూచునట్టి - జ్ఞానముగల - (మునేః) మునికి, (నిశా) రాత్రి.

[సర్వభూతములకును పరమార్థతత్త్వము అంధకారము వంటిది. దానియందు వారు వ్యవహరింపజాలరు. జ్ఞాని దాని యందే క్రీడించును. అన్ని భూతములును కామక్రోధాది ప్రకృతి లక్షణములలో సంచరించుచున్నవి. జ్ఞాని కందేమియు వ్యవహారము లేదు.]

ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి. 72

పార్థ! (ఏషా) ఇది, (బ్రాహ్మీ) బ్రహ్మమందుండెడు, (స్థితిః) ఉనికి, (ఏనాం) దీనిని, (ప్రాప్య) పొంది-మానవుడు- (నముహ్యతి) మోహము పొందడు. (అంతకాలేఽపి) చివరి వయస్సులోనైనను, (అస్యాం) ఈస్థితియందు, (స్థిత్వా) ఉండి, (బ్రహ్మనిర్వాణం) బ్రహ్మానందమును-మోక్షమును- (ఋచ్ఛతి) పొందును.

'[బాల్యమునుండియు నిట్టి స్థితిలోనున్నవారి విషయ మిక చెప్పవలసినదేమి?' అనునది 'చివరి వయస్సులోనైనను' అనుదాని కర్థము.

[ఈ యధ్యాయములో పరమేశ్వరుడు పరమార్థ దృష్టితో భీష్మాదుల మరణమును పరామర్శించి అనిత్యమైన స్వర్గసుఖము నపేక్షించియైనను యుద్ధమను ధర్మము చేయ దగుననియు, కాని యీయపేక్ష నిరసింపదగినదనియు, ఆ ధర్మమునే నిష్కామముగ నాచరించినచో సమబుద్ధియు, జ్ఞానము, నిత్యానందము గల్గుననియు చెప్పి, తుదకు జ్ఞాని యొక్క (స్థితప్రజ్ఞునియొక్క) వర్ణనము చేసినాడు. ఇట కర్మ యోగము ఆత్మజ్ఞాన సంపాదనమునకు సాధనముగా చెప్పబడిన దనుట స్పష్టము. ఏవి యిట స్థితప్రజ్ఞుని లక్షణములుగా చెప్ప బడినవో అవియన్నియు, అజ్ఞానావస్థలోనే ప్రస్తుతముండి స్థిత ప్రజ్ఞుడు కాదలచుకొన్నవాడు క్రమముగా అభ్యసించుకొన వలసిన గుణములనికూడ తెలిసికొనవలయును.]

—:O:—

# తృతీయాధ్యాయము

## కర్మయోగము

ద్వితీయాధ్యాయములో భగవానుడు అర్జునునకు ఫలాసక్తినిపేడి కర్మ చేయవలసినదని బోధించెను. మఱియు సుఖదుఃఖములయందు సమబుద్ధిగల్గి కామములనువీడి, ఆత్మయందే క్రీడించు స్థితప్రజ్ఞునకు మోక్షమువచ్చునని చెప్పబడినది. కావున అర్జునునకీ క్రింది సందేహముగల్గినది! "సమబుద్ధిచేతను, ఆత్మరతిచేతను, మోక్షము-గల్గుచో వానిని సంపాదింపవలయునని నాకు బోధింపవలయునేగాని కర్మచేయవలసినదిగ నేల బోధింపవలయును? నిరంతరము ఆత్మవిచారము చేయుచు ప్రపంచములో నేపనియు చేయక సర్వకర్మసన్యాసము గావించుటయను సాంఖ్యమార్గముచే ఆత్మబుద్ధిగల్గును గావున కర్మచేయుట వ్యర్థముగదా!" ఆత్మజ్ఞానముగల్గిన పిమ్మట సాంఖ్యమార్గము నవలంబించి జీవితశేషమును గడుపదగునుగాని, ఆత్మజ్ఞానమును సంపాదించుటకు పూర్వము కేవలము సాంఖ్యము సాధనముగా చెల్లదనియు, ఆత్మజ్ఞానమును సంపాదించుటకు ముఖ్యసాధనము నిష్కామకర్మయోగమే యనియు భగవానుని మతము. అర్జునునకింకను ఆత్మజ్ఞానము కలుగలేదు కావున ఆతనికి నిష్కామకర్మయోగమే శరణ్యమగుచున్నది.

అర్జునుని ప్రశ్నమునకు భగవాను డిట్లు సమాధానము చెప్పుచున్నాడు:—

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠాపురా ప్రోక్తా మయాఽనఘ
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం. 3

(అనఘ) ఓపాపరహితుడా! (పురా) సృష్ట్యారంభ కాలమునందు–వేదములలో–(మయా) నాచేత. (అస్మిన్) ఈ, (లోకే) లోకమునందు, (సాంఖ్యానాం) ఆత్మజ్ఞానముకల వారై కర్మలను విడచు – సన్యాసులకు, (జ్ఞానయోగేన) కర్మలతో కలియని జ్ఞాన మనెడు సాధనముచేతను, (యోగినాం) సమబుద్ధి–జ్ఞానము–కలిగి నిష్కామముగా కర్మచేయువారికి, (కర్మయోగేన) కర్మనాచరించుట యను సాధనముచేతను, (ద్వివిధా) రెండు విధములైన, (నిష్ఠా) స్థితి – మార్గము – (ప్రోక్తా) చెప్పబడినది.

[జ్ఞానము గలిగిన పిమ్మట మరణపర్యంతము జ్ఞాని సర్వకర్మలను సన్యసించి కేవల మాత్మచింతలో నుండ వచ్చును; లేక సమబుద్ధితో కర్మల నాచరించుచు కాలము గడుపవచ్చును. ఈ రెంటిలోను ఏమార్గములో నున్నను మరణమునకు పిమ్మట మోక్షమే; కాని జ్ఞాని కికజన్మబంధ ముండదు. ఇట్లు రెండు మార్గములున్నచో నేనేల కర్మచేయ వలయునని యభిప్రాయము. సమాధానమేమన: నీకుజ్ఞానము కలుగలేదు. కాన కర్మయోగ మొక్కటియే నీకు మార్గము.

అనగా కర్మలను విడిచిపెట్టుట యనునది జ్ఞానము కలిగిన పిదప పొందవలసినదే యగుటచేతను, జ్ఞానమునకు నిష్కామముగా కర్మచేయుట సాధనమగుటచేతను, (కర్మలులేనిపరిస్థితికి) నైష్కర్మ్యమునకు ఒకడు రావలయునన్నచో వాడు ముందుగా కర్మల నాచరింపవలసియే యుండును. కావున జ్ఞానులైన సాంఖ్యులు కర్మను విడిచిపెట్టుచున్నారుగదా, అని తలచి జ్ఞానములేనివాడు కూడ కర్మలను విడుచుచో వానికి మోక్షమురాదు. 4

న కర్మణామనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
న చ సన్న్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి. 4

(కర్మణాం) కర్మలయొక్క, (అనారంభాత్) చేయక పోవుటవలన, (పురుషః) పురుషుడు, (నైష్కర్మ్యం) జ్ఞానము గలిగి కర్మలను సన్యసించు స్థితిని, (నాశ్నుతే) పొందడు, (సన్న్యసనా దేవ) సన్యసించుటవలననే, (సిద్ధిం) నైష్కర్మ్యమును, (న సమధిగచ్ఛతిచ) పొందడు.

[ప్రతి మానవుడును ఏదో యొక ప్రకృతితో పుట్టును. దీనిననుసరించియొకవిధమైనపనులను వాడు చేయుచుండును. ఆపనులు ధర్మవిరుద్ధములు గాకుండ వాడు చూచుకొనవలయును. ఆ ప్రకృతినే మార్చుటకు ప్రయత్నింప నక్కఱలేదు. ఒకడు ప్రతాపమే ముఖ్యలక్షణముగాగలవాడయిపుట్టవచ్చును. వాడా ప్రతాపమును లోకక్షేమకరములైన మార్గములలో

నుపయోగింపవలయును. సాధుహింస చేయరాదు. అట్లే యొకడు కవితాశక్తితో పుట్టవచ్చును. వాడు కవిత్వ సాధనముచే ధర్మసేవ చేయవలయును. వాడు బుద్ధిపూర్వకముగా అట్లుచేయనిచో వానికవిత వక్రమార్గములోనికి పోవచ్చును. అర్జునుడు క్షత్రియధర్మముతో పుట్టినాడు. ఇప్పుడతడు ధర్మయుద్ధమునుండి విరమించినను రేపు అధర్మయుద్ధమునైనను చేయువాడే యగును. కావున ధర్మమైన ప్రస్తుత కర్తవ్యమును వీడరాదు.

[ఎవరికైనను బాల్యముననే జ్ఞానోదయమైనచో వాని నిష్కామకర్మసాధన పూర్వజన్మములోనే సంపూర్ణమాయెనని తెలిసికొనవలయును.]

జ్ఞానము గలుగనివాడు బాహ్యముగా పనులను మానినను, వానికి మనస్సులో నింద్రియవాంఛ లుండును. అట్లు కర్మలను మానినవాడు దంభాచారి యనిపించుకొనును.6 ఎవ్వడు బాహ్యముగా కర్మలు చేయుచు ఇంద్రియములను నిగ్రహించుకొని యుండునో వాడు గొప్పవాడు.7 కావున ఓ యర్జునా! నీవు శాస్త్రోక్తములైన కర్మలను మానవలదు.8 ఈశ్వరార్పణముగా చేయు కర్మయెప్పుడును బంధమును గలిగింపదు. కావున నీవు ఫలాసక్తిని విడచి, ఈశ్వరార్థమై కర్మ చేయుము.9 ఈసృష్టి నడచుట ఈశ్వరసంకల్పము. ఇది యిట్లు నడచుటకు తోడ్పడుట మానవునకు ధర్మము. ప్రజాపతి:లోక

ములను, మానవులను, దేవతలనుసృజించి, మానవులుయజ్ఞ ములచే దేవతలను తృప్తులను జేయవలయుననియు, దేవతలు వర్షాదులనిచ్చి మనుష్యులకు భోగాదులను కల్పింప చేయవల యుననియు నిర్ణయించెను. కావున తనయొక్క జీవయాత్ర కొరకైనను, యితరుల జీవయాత్రకొరకైనను ప్రతిమానవుడు యజ్ఞములను చేయవలయును. ఈ యజ్ఞకర్మలనుచేయుట మానవునకు గూడ విధి. వీనిని చేయనివాడు పాపి. 10-16.

దేవాన్భావయతానేన తే దేవా భావయన్తు వః
పరస్పరం భావయంతశ్శ్రేయః పర మవాప్స్యథ. 11

[ప్రజాపతి ప్రజలతో నిట్లనెను.]

(అనేన) ఈ యజ్ఞముచేత, (దేవాన్) దేవతలను, (భావయత) వృద్ధిపొందింపుడు, (తే) ఆ, (దేవాః) దేవతలు (వః) మిమ్ములను, (భావయన్తు) వృద్ధి పొందింతురుగాక. మీరును, దేవతలును- (పరస్పరం) ఒకరినొకరు (భావయన్తః) వృద్ధి పొందించుకొనుచున్నవారై (పరం) గొప్పదైన, (శ్రేయః) శ్రేయస్సును, (అవాప్స్యథ) పొందుదు. [నిష్కామ ముగా యజ్ఞముల నాచరించినమానవులు ఆత్మజ్ఞానమును, సకామముగా ఆచరించు మానవులు స్వర్గాదులను పొందు దురని తెలిసికొనవలయును.

[ఈ క్రింది పంచమహాయజ్ఞములను ప్రతిమానవు డును ప్రతిదినము నాచరింపవలయును. 1. దేవయజ్ఞము

2. పితృయజ్ఞము, 3. మనుష్యయజ్ఞము (అతిథియజ్ఞము) 4. భూతయజ్ఞము, 5. ఋషియజ్ఞము, దేవతలకును, అతిథులకును అర్పింపగా మిగిలిన దానిని గృహస్థుడు భుజింపవలయును.] ఎవరు తమకొరకే అన్నము వండుకొనుచున్నారో (దేవతలకును, అతిథులకును, అన్నము నర్పింపరో) వారు పాపమునే తినుచున్నారు. 15

భుంజతే తేత్వఘం పాపాయే పచంత్యాత్మకారణాత్

(యే) ఎవరు, (ఆత్మకారణాత్) తమకొరకే, (పచంతి) వండుకొనుచున్నారో (తే) ఆ (పాపాః) పాపులు (అఘం) పాపమును, (భుంజతే) తినుచున్నారు.

[ఈ కర్మలనుగూడ ఎవ్వడు మానివేయవచ్చుననగా]

యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః
ఆత్మన్యేవచ సంతుష్ట స్తస్య కార్యం నవిద్యతే.

(యస్తు) ఎవడు, (ఆత్మరతిరేవ) విషయములను వీడి ఆత్మయందే ఆనందముకలవాడై, (స్యాత్) అగునో, (ఆత్మతృప్తశ్చ) ఆత్మచేతనే తృప్తినిపొందినవాడో - బాహ్యవిషయములక్కరలేదో (ఆత్మన్యేవ) ఆత్మయందే సంతోషము గలవాడో, (తస్య) వానికి (కార్యం) చేయతగినది. (నవిద్యతే) లేదు.

అయినను కొందరు ఆత్మజ్ఞాననిష్ఠులు లోకసంగ్రహార్థమై కర్మలను చేసినారు.

కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్కర్తు మర్హసి. 20

(జనకాదయః) జనకుడు మొదలైనవారు-జ్ఞానులయ్యు ను(కర్మణైవ)- స్వధర్మమైన రాజ్యపరిపాలనాదులను-చేయుటతోనే-కర్మలను వీడకుండగనే- (సిద్ధిం) మోక్షమును (ఆస్థితాః) పొందిరిగదా? (లోకసంగ్రహమేవాపి) లోకమును చక్కని స్థితిలోనుంచుటనైనను (సంపశ్యన్) చూచుచున్నవాడవై (కర్తుం) కర్మచేయుటకు (అర్హసి) తగియున్నావు.

[జ్ఞానము కలిగినపిమ్మట మరణపర్యంతము జ్ఞాని కర్మ చేయవచ్చునని పైని చెప్పిన దానిని ఇచట అనుసంధించుకొనవలయును. మరియు యజ్ఞప్రకరణములో 10 వ శ్లో॥ మొదలు 16 వ శ్లో॥ వరకు-సృష్టిచక్రము సరిగా తిరుగుటకు ప్రతి మానవుడును తోడ్పడవలయునని యున్నది. కావున, ఆ లోకసంగ్రహదృష్టితో నైనను నీవు కర్మను చేయవలయునని భగవానుడు అర్జునునకు చెప్పుచున్నాడు. ఇంతమాత్రమున అర్జునునకు జ్ఞానమువచ్చినట్లు అనుకొనరాదు.

[ఈ లోకసంగ్రహము రెండు విధములుగా నుండవచ్చును. 1. శాస్త్రీయములైన లోకక్షేమకర కార్యములను చేయుటచే లోకమున కుపకరించుట. 2 సంఘగౌరవమునకు పాత్రమైన తాను కర్మలను వీడుటకు అర్హతకలిగి వీడినను తన్నే ఆదర్శముగా తీసికొన్న ఇతరులును, కర్మలను వీడుట

కధికారములేనివారయ్యును, శాస్త్రీయకర్మలను వీడి భ్రష్టులుగాకుండ చేయుటకై కర్మలనుచేయుట. ఇట్టి లోకసంగ్రహముకొఱకే నేను పరిపూర్ణుడనయ్యును కర్మలను చేయుచున్నానని భగవానుడు చెప్పుచున్నాడు.]

నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి. 22

(అనవాప్తం) నాచేత పొందబడనది (అవాప్తవ్యం) పొందబడతగినది. (న) లేదు. అట్లయినను (కర్మణి) కర్మయందు (వర్తఏవచ) ఉండుచునేయున్నాను - అవతారాది కృత్యములను చేయుచునే యున్నాను.

ఆత్మజ్ఞానము కలిగి కర్మచేయుటలోను ఆత్మజ్ఞానము లేక కర్మచేయుటలోను ఎట్టిభేద మున్నదనః

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకారవిమూఢాత్మా కర్తాహ మితి మన్యతే. 27

(కర్మాణి) కర్మలు, (ప్రకృతేః) సత్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతియొక్క- (గుణైః) గుణములచేత-కార్యములు, కారణములుననెడు వికారములచేత-(సర్వశః) అన్నివిధములుగాను, (క్రియమాణాని) చేయబడుచున్నవి. అహంకారవిమూఢాత్మా) అహంకారముచేత నానావిధములుగా మూఢమైన అంతఃకరణముగలవాడు, (అహం) నేను, (కర్తా) కర్తను, (ఇతి) అని, (మన్యతే) తలంచుచున్నాడు.

తత్త్వవిత్తు మహాభాగ! గుణకర్మ విభాగయోః
గుణా గుణేషు వర్తంతే ఇతి మత్వా న సజ్జతే. 28

(మహాభాగ) ఓ మహానుభావా! (గుణకర్మవిభాగయోః) గుణములయొక్కయు, కర్మలయొక్కయు, విభాగముయొక్క (తత్త్వవిత్) యాథార్థ్యము నెరిగియున్నవాడన్నవో, (గుణాః) ఇంద్రియములనెడు ప్రకృతిగుణములు, (గుణేషు) శబ్దాదివిషయములనెడు గుణములయందు, (వర్తన్తే) ప్రవర్తించుచున్నవి. (ఇతి) ఇట్లు, (మత్వా) తలంచి,(నసజ్జతే) తగులుకొనడు. (ఆసక్తుడు కాడు.)

[ఇట్టి అసంగభావము కలుగవలయునన్నచో, అన్ని కర్మలను పరమేశ్వరార్పణముగా కొంతకాల మాచరించవలయును. కావున అట్టి అర్పణభావముతో యుద్ధము చేయవలయునని పరమేశ్వరుడీ క్రింది శ్లోకములో చెప్పుచున్నాడు.]

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాఽధ్యాత్మచేతసా
నిరాశీ ర్నిర్మమోభూత్వా యుధ్యస్వ విగతజ్వరః. 30

(అధ్యాత్మచేతసా) ఆత్మజ్ఞానబుద్ధిచేత, (మయి) పరమేశ్వరుడనైన నాయందు, (సర్వాణి) సమస్తములైన, (కర్మాణి) కర్మలను, (సన్న్యస్య) ఉంచి,-నాకర్పింపబడునట్లు చేసి,-(నిరాశీః) ఆశలేనివాడవై, (నిర్మమః) మమకారము-నాదియను భావము-లేనివాడవు, (భూత్వా) అయి, (విగతజ్వరః) సంతాపమును వీడినవాడవై, (యుధ్యస్వ) యుద్ధము చేయుము.

[ఈ నీ మతమును శ్లోకములో కొందరాచరింపక, సకామకర్మములనుగాని, ధర్మపరిత్యాగమునుగాని, ఎందులకాచరించుచున్నారనః ఎల్లరును పూర్వజన్మసంస్కారము ననుసరించి ప్రవర్తించుచున్నారని భగవానుడు చెప్పుచున్నాఁడు]

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి
ప్రకృతిం యాన్తిం భూతాని నిగ్రహః కిం కరిష్యతి. 33

(జ్ఞానవానపి) తెలిసినవాడుకూడ, (స్వస్యాః) తనయొక్క (ప్రకృతేః) పూర్వమందు చేయబడిన ధర్మాధర్మములయొక్క సంస్కారమనెడు ప్రకృతికి, (సదృశం) తగునట్లుగా, (చేష్టతే) వ్యవహరించుచున్నాడు. (భూతాని) ప్రాణులు, (పకృతి) ప్రకృతిని (యాన్తి) అనుసరించుచున్నవి, (నిగ్రహః) ఇట్లు చేయరాదు అను నిషేధము, (కింకరిష్యతి) ఏమిచేయును ?

[అట్లైనచో ప్రాణిబాగుపడుటయెట్లు ? అను ప్రశ్న బయలుదేరును. ప్రతి మానవుడును స్వప్రయత్నముచేత ఇంద్రియ నిగ్రహమును అలవరుచుకొనుచు తన ప్రకృతిని దిద్దుకొనవచ్చును. ఇట్లు దిద్దుకొనుటకును పైని తెల్పిన ప్రకృతిశక్తికిని విరోధములేదు. ఏలయన ఈ పురుషకారము గూడ ఎప్పటికప్పడు ఉత్తరక్షణములో పూర్వకృతకర్మసంస్కారమగుచు ప్రకృతికి దారితీయుచుండును. పురుషకారమున కట్టిశక్తి వేదాంతశాస్త్రములో నంగీకరింపబడినది.

కావున ఇంద్రియనిగ్రహ మలవరచుకొనవలయును 35. అందు లకు కామక్రోధములను జయించుట ముఖ్యము]

తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ
పాప్మానం ప్రజహిహ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ 41

(హేభరతర్షభ) ఓ భరతకులశ్రేష్ఠుడా! (తస్మాత్) ఆ హేతువువలన, (త్వం) నీవు, (ఆదౌ) ముందుగా (ఇంద్రియాణి) ఇంద్రియములను, (నియమ్య) నిగ్రహించి, (జ్ఞానవిజ్ఞాన నాశనం) జ్ఞానమును విజ్ఞానమును నాశనముచేయు, (ఏనం) ఈ, (పాప్మానం) పాపాచారముగల కాలమును, (ప్రజహిహి) విడిచిపెట్టుము.

మానవుడు రాగద్వేషములకు వశుడు కాకూడదను నీప్రకరణమున నీక్రింది సుప్రసిద్ధశ్లోకము గానవచ్చుచున్నది.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. 35

(విగుణః) గుణరహితమైనను,—పైకిచెడ్డదిగా కన్పట్టినదైనను—(స్వధర్మః) శాస్త్రములచే నొకవ్యక్తికి నిర్దేశింపబడినస్వధర్మము, (స్వనుష్ఠితాత్) బాగుగాచేయబడిన, (పరధర్మాత్) ఇతరుల ధర్మముకంటె,—శాస్త్రములితరులకు నిర్ణయించిన ధర్మములకంటె— (శ్రేయాన్) మేలుగల్గించునది. (స్వధర్మే) తనధర్మమందు, (నిధనం) చావు, (శ్రేయః) మేలు (పరధర్మః) ఇతరధర్మము, (భయావహః) భయమును గల్గించునది.

[రాగద్వేషదృష్టితో చూచినచో నొకప్పుడు శాస్త్రోక్తమైన స్వవర్ణాశ్రమధర్మము చెడ్డదిగా తోచవచ్చును. ఇప్పు డర్జునున కట్లే తోచినది; బంధుమిత్రానురాగముచే యుద్ధము చెడ్డదిగా తోచుచున్నది. మఱొక క్షత్రియునకు ఆత్మానురాగముచేతనే ఈ యుద్ధములో చావనేల? మరొక రీతిగ 'నీ శరీరమును ధర్మమునకై ఉపయోగింపరాదా?' యని తోచవచ్చును. ఇంకొక క్షత్రియునకు "నేను యుద్ధముకంటె వర్తకమునే బాగుగా చేయగలనుకావున వ్యర్థముగ యుద్ధములో చావనేల?" యని తోచవచ్చును. ఈమూడు విధములైన వారును అపమార్గములోనే యున్నారనియు ఇట్టి యాలోచనలచే స్వధర్మమువీడి పరధర్మమును స్వీకరించుట పాపహేతువగుననియు నీ శ్లోకములో భగవానుడు చెప్పుచున్నాడు.

[ఈవిషయము చతుర్థాధ్యాయములోను (13 వ శ్లో) అష్టాదశాధ్యాయములోను (41-45 శ్లో) మఱికొంత వివరింపబడును. గీతలలో స్వధర్మమన స్వవర్ణాశ్రమ ధర్మమే యయినను వర్ణవ్యవస్థకు ప్రసక్తిలేని దేశములలోను, సందర్భములలోను కూడ వర్తించు నీ క్రింది యుదాహరణమునుకూడ తీసికొనవచ్చును: ఒకనితల్లి రోగగ్రస్తురాలై యుండును. ఆమెకు సేవచేయుచు చెంతనుండుట తన ధర్మమని కుమారునకు తెలియును. కాని యట్టిస్థితిలో నొకచోట సుప్రసిద్ధుడైన యొక వక్తయొక్క యుపన్యాసము జరుగును. దానియందాసక్తిచే

వీడు స్వధర్మమును వీడుట కుంకించును. తన కృత్యమును సమర్థించుకొనుటకై వాని కనేకయుక్తులు స్ఫురింపవచ్చును. ఉపన్యాసము వినుటచే జ్ఞానముగలుగుననియు, దానివలన నేమేమో చేయవచ్చుననియు నాతడు చెప్పును. మఱియు తల్లియను నొకవ్యక్తికి సేవచేయుటకంటె ననేకవిధముల నుపయోగపడు జ్ఞానము నార్జించుట మేలనియు వాదించును. ఇది యంతయు ఉపన్యాసమునందలి రాగముచే ధర్మమును వీడుటను ఎట్లో సమర్థించుకొనుటయే కాని మరొకటికాదు. ఇట్టి ధర్మత్యాగముకూడ నీశ్లోకముచే నిషేధింపబడుచున్నది.

[అట్టి మఱొకవిధమైన ధర్మత్యాగమున కీ క్రింది యుదాహరణమును తీసికొనవచ్చును: వర్తకములో విశేష ధనము నార్జించి వైజ్ఞానికులను పోషించి, విజ్ఞానాభివృద్ధికి తోడ్పడు వదాన్యు డొకడుండును. అది వానికి సహజ ప్రావీణ్యముగల స్వధర్మమని చెప్పనొప్పును. ఇంతలో వానికీ క్రిందిరీతిగా విపరీతబుద్ధి పుట్టవచ్చును. "విజ్ఞానము గొప్పది యను భావముచేకదా నేనింతకాలము వైజ్ఞానికులను పోషించుచున్నాను! అట్టి విజ్ఞానము నేనే సంపాదించుట మరింత మంచిదికదా! కావున నేటినుండి ధనార్జనసాధనమైన వర్తకమును విడచి విజ్ఞానసంపాదనమున కుపక్రమించెదను." ఇట్లెంచి యాతడు వర్తకమును వీడువో వానిచే పోషింపబడు పండితులకు కల్లోలపరిస్థితి యేర్పడును. విజ్ఞానాభివృద్ధి యడ్డిపోవును; ఆతడు విజ్ఞానము సంపాదించుట సందిగ్ధవిష

యము; సంపాదించినను ఆవర్తకములోని చాకచక్య మందు రాడు. ఇట్లు విజ్ఞానమందలి యాసక్తి పేరుచెప్పి యాతడు స్వధర్మమైన వర్తకపోషకధర్మము వీడి యన్యధర్మ మవలంభింపదలచి యన్నిటికిని చెడినవాడై తాను గౌరవభావముతో చూచు విజ్ఞానమునకే హాని చేసినవాడగును. కావున పరమేశ్వరుడెవని కేశక్తి నిచ్చియున్నాడో వా డా శక్తి మూలమున నే లోకసంగ్రహమును చేయుచు పరమేశ్వరానుగ్రహమును సంపాదింపవలయును. పైపై వ్యామోహములకు లోనై స్వధర్మమును వీడరాదు.

[ముఖ్యముగా వర్ణాశ్రమ ధర్మపరమైన యీ శ్లోకమున కింతవఱకును చూపబడిన వ్యాప్తినేకాక యింకను హెచ్చు వ్యాప్తినే సాధింపవచ్చును. గ్రంథవిస్తరము కాకుండుటకై యింతతో వీడుచున్నాను.]

# చతుర్థాధ్యాయము

## జ్ఞానయోగము

[పూర్వాధ్యాయములో చెప్పబడిన లోకసంగ్రహార్థమైన నిష్కామకర్మయోగము ప్రాచీనకాలముననే క్షత్రియ పరంపరలో చిరకాలము ఆచరణములో నుండెను. క్షత్రియులు లోకములో శాసనముచే ధర్మము నిలబెట్టవలసినవారు కావున వారిలో జ్ఞానులైన వారుకూడ లోకసంగ్రహార్థమై కర్మలను చేయుట యుపపన్నముగనే యున్నది.]

"ఓ యర్జునా! నేనీ కర్మయోగమును వివస్వంతునకు చెప్పితిని; ఆతడు మనువునకు, మనువు ఇక్ష్వాకునకు చెప్పగా, పారంపర్యముగా నిది కొంతకాలము నడచి, తరువాత లోపించిపోయినది. నీవు నాకు భక్తుడవు, సఖుడవు గావున నీకిప్పుడు దానినే చెప్పితిని." అని భగవంతుడనును. (1-3) దానిపై అర్జునుడు "ఓకృష్ణా, ఏనాటివాడో అయిన వివస్వంతునకు నీవు చెప్పుట యెట్లు సంభవించెను?" అని ప్రశ్నించును.4

[అంత భగవానుడు తన యవతారముల తత్త్వము తెలుపును. సంభాషణములో మిక్కిలి సహజముగా ప్రసక్తమైన యీ యవతారవిషయము చతుర్థాధ్యాయములో ప్రతిపాదింపబడు ముఖ్యాంశమైన జ్ఞానమునకు కూడ సన్నిహిత

ముగా సంబంధించినదగుట గమనింపదగిన విషయము. నిరా కారుడు, నిరంజనుడు, నిర్వికారుడునయిన పరమేశ్వరుడు లోకములో రూపమును ధరించుటలోని తత్త్వమును తెలిసి కొనుటకంటెను, తన్మూలకముగా స్ఫుటమగు జ్ఞానియొక్క లోకవ్యవహారరీతిని తెలిసికొనుటకంటెను ఆత్మతత్త్వరహస్య పరిజ్ఞాన మేముండును? కావుననే యీ యధ్యాయమునకు జ్ఞానయోగ మనుపేరు వచ్చినది. ఇందు జ్ఞానము గల్గి కర్మఫలాసక్తి వీడి లోకములో వ్యవహరించుట ప్రదర్శింప పడినది. కావున దీనికి జ్ఞానకర్మసన్న్యాసయోగమని కొం దరు వ్యవహరించుచున్నారు. మఱియు ఏకమై పూర్ణమై యుండు ఆత్మజ్ఞానముతో లోకములో వివిధరీతుల వ్యవహ రించుట యిందు గన్పట్టుటచే దీనికి జ్ఞానవిజ్ఞానయోగమని కొందరు నామకరణము చేసినారు. గీతయొక్క భిన్నప్రతు లలో నీమూడు పేర్లును గన్పట్టు చున్నవి.]

"ఓ యర్జునా, నాకును నీకును గూడ ననేక జన్మ ములు ఇదివఱకు గడచినవి. నేను వాని నెఱుగుదును. నీ వెఱుగవు. 5. నేను పుట్టుకలేనివాడనైనను నా మాయచేత ప్రకృతి నధిష్ఠించి పుట్టుచున్నాను. 6

నేను ఎందులకు జన్మింతు ననగా:

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్. 7

భారత! (యదాయదా) ఎప్పుడెప్పుడు, (ధర్మస్య) ధర్మమునకు, (గ్లానిః) హాని, (భవతి) అగుచున్నదో, (అధర్మస్య) అధర్మమునకు, (అభ్యుత్థానమ్) అభివృద్ధి అగుచున్నదో-(తదా) అప్పుడు, (ఆత్మానం) నన్ను, (అహం) నేను, (సృజామి హి) సృజించుచున్నాను గదా?

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే. 8

(సాధూనాం) సన్మార్గమందున్న వారియొక్క (పరిత్రాణాయ) రక్షణముకొరకును (దుష్కృతాం) పాపాత్ముల యొక్క (వినాశాయచ) నాశనముకొరకును, (ధర్మసంస్థాపనార్థాయ) ధర్మమును నిలబెట్టుటకొరకును, (యుగేయుగే) ప్రతియుగమందును, (సంభవామి) పుట్టుచున్నాను.

ఈవిధమైన నా అవతారముల యొక్కయు, పనుల యొక్కయు, తత్త్వమును తెలిసికొన్నవాడు మోక్షమును పొందును. 9

[ద్వితీయాధ్యాయ ప్రారంభములో చెప్పబడిన ప్రకృతి లోకమునంతను వ్యామోహపెట్టునదేగాని పరమేశ్వరుని వద్ద దాసురాలై వశవర్తినియై యుండును. ఈ ప్రకృతికే మాయయనిపేరు. అందరి జననమరణములకును సుఖదుఃఖములకును కారణ మీమాయయే యగుటచేతను, ఇది ఈశ్వరుని యధీనమందుండుటచేతను పరమేశ్వరుడు మాయ యను

సాధనముచే జగత్తును నడుపుచున్నాడని చెప్పవచ్చును. అనగా జగద్విషయములో ఈశ్వరుని శక్తియని చెప్పదగిన దీమాయ. మాయకు వశులైయున్న ప్రజలమధ్యమునకు పరమేశ్వరు డవతారముగా వచ్చినంతమాత్రముచే పరమేశ్వరుడితరులకువలెనే మాయకు బద్ధుడైనట్లుకాదు. ప్రకృతి యొక్క కారాగారమువంటిది. అందు సర్వప్రాణులను బద్ధులై యున్నారు. వీరి యోగక్షేమముల నిమిత్తమై పరమేశ్వరుడిచ్చటకు వచ్చినంత మాత్రమున ఆతడును బద్ధుడని చెప్పుటకు వీలులేదు. బద్ధుల యోగక్షేమముల నరయుటకు కారాగారాధికారి కారాగారములో ప్రవేశించినంత మాత్రముచేత ఆతడు బద్ధుడగుటలేదుగదా? పరమేశ్వరునియొక్క ఈ అప్రాకృతమైన ఐశ్వర్యమునుగూర్చి తలంచుట భక్తులకు అనిర్వచనీయానందమును ఒనగూర్చుటయేకాక జ్ఞానమునకు సాధనమగును. మాయామోహము నతిక్రమించి యాత్మకు సహజమైన యానందమును పొందవలెనన్నచో మాయాధీశుడైన పరమేశ్వరుని అనుగ్రహ మవశ్యముగా నుండవలయును. కావుననే రాబోవు శ్లోకములో నన్నాశ్రయించినవారు మోక్షమును పొందినారని భగవంతుడు చెప్పుచున్నాడు.

వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః.

(వీతరాగభయక్రోధాః) రాగమును, భయమును, క్రోధమును వీడినట్టియు, (మన్మయాః) నా విషయమై అభేద దృష్టి గలిగినట్టియు, (మాం) నన్ను, (ఉపాశ్రితాః) ఆశ్రయించినట్టియు, (బహవః) అనేకులు (జ్ఞానతపసా) పరమాత్మ విషయకమైన జ్ఞానమనెడు తపస్సుచేత, (పూతాః) పరిశుద్ధులై, (మద్భావం) ఈశ్వరత్వమును. (ఆగతాః) పొందిరి.

[అందరకును మోక్షమునీయక కొందరికేయిచ్చుటచే నీ పక్షపాతము వెల్లడియగుటలేదా యన, ఎవరేది కోరి నన్నారాధించిన వారికి దానినే యిచ్చుచున్నవాడ నగుటచే నాకు పక్షపాతము లేదని పరమేశ్వరుడు చెప్పుచున్నాడు.]

యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః. 11

ఓ పార్థ ! (యే) ఎవరు, (మాం) నన్ను, (యథా) ఎట్లు, (ప్రపద్యంతే) పొందుచున్నారో, (తాన్) వారిని, (తథైవ) అట్లే, (అహం) నేను, (భజామి) అనుగ్రహించుచున్నాను. (మనుష్యాః) మనుష్యులు, (సర్వశః) అన్నివిధములచేతను, (మమ) నాయొక్క, (వర్త్మ) మార్గమును (అనువర్తన్తే) అనుసరించుచున్నారు.

ఇతరలోకముకంటె మనుష్యలోకములో చేయబడిన కర్మలు శీఘ్రముగా ఫలించును. కనుక మానవులు అల్పము

లైన కోరికలతో దేవతలను (నన్నే) ఆరాధించుచున్నారు. మనుష్యలోకములో వర్ణాశ్రమకర్మాధికారము గల చాతుర్వర్ణ్యమును నేనే సృజించుచున్నాను.

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః 13

(గుణకర్మవిభాగశః) జీవునకు గల సత్వరజస్తమోగుణముల యొక్కయు, పూర్వజన్మలో చేసికొన్న కర్మల యొక్కయు విభాగము ననుసరించి, (చాతుర్వర్ణ్యం) నాల్గు వర్ణముల ప్రజయు, (మయా) నాచేత, (సృష్టం) సృజించబడినదై యగుచున్నది.

[ఒక వర్ణములో ఒకడు జన్మించుచో నేనే వానినచట జన్మింపజేసినానని తెలిసికొనుము. ఏయాధారముచే జన్మింప చేసినాననగా ఆ జీవునకు సత్వరజస్తమోగుణములలో ఏవియేపాళ్ళలోనున్నవో, పూర్వజన్మలో ఆ జీవుడెట్టి కర్మలు చేసికొననో అను రెంటినిబట్టియు చేయుచున్నాను. పూర్వజన్మలో జీవుని గుణకర్మలనుబట్టి యీజన్మలో వర్ణము నిర్ణయమగునని ఛాందోగ్యోపనిషత్తులోకూడ నున్నది.]

నేను జన్మలేనివాడనే యయ్యు జన్మనెత్తినట్లే సృష్టిని చేయుచును చేయనివాడనే యగుచున్నాను. పుణ్యపాపాదులన్నియు గల్గిన ప్రకృతికి నే నతీతుడను, నీవు నట్లే బ్రహ్మాత్మత్వమును తెలిసి కర్మచేయుచో కర్మబద్ధుడవు కాకుందువు. 14–15

[ఆత్మ సచ్చిదానందస్వరూపమైనది. అనగా (1) ఎల్లప్పుడును ఏవిధమైన మార్పును లేకుండునది (2) జ్ఞానరూపమైనది. ఏ పనిచేయుట యైన ఇందు మొదటిదానికి విరుద్ధమే యగును. కావున ఆత్మ నిష్క్రియము. మానవుడాత్మస్వరూపుడేయయ్యు "నేను చేయుచున్నాను" అని భావించుచున్నాడు. ఈభావన పోయిననే కాని ఆత్మానుభవము కలుగదు. కర్మ కలదివలె పైకి కన్పట్టు ఆత్మయందు కర్మరాహిత్యమును చూడవలయునని దీని యర్థము. కర్మయంతయు ప్రకృతిలోనిది. శరీరాదులు ప్రకృతిలోనివై కర్మ నాచరించుచున్నవి. అవి కర్మలను చేయుచున్నట్లు మనకు తోచక మనమే వానిమూలమున చేయుచున్నామని తలచుచున్నాము. కావున కర్మలను చేయునవి శరీరాదులేయని గుర్తించినపుడే యథార్థజ్ఞానము గల్గినదని చెప్పవచ్చును. అట్టిబుద్ధితోనెవడు కర్మలు చేయునో వాడు అహంకారమమకారములతో కర్మ చేసినవానివలె, నెట్టి పుణ్యపాప కర్మఫలమును పొందడు. మఱియు వాడు పరమాత్మ స్వరూపము నొందుటచే దేహములో కర్మ చేసినను చేయకపోయిననుకూడ సర్వజగత్కర్త యగుచున్నాడు, అది జ్ఞానకర్మ రహస్యము, కర్మవత్త్వముతో నున్నట్లు (కర్మలు చేయుచున్నట్లు) కన్పట్టు ఆత్మయందు నిష్క్రియత్వమును, నిష్క్రియత్వములో నున్నట్లు కన్పట్టు దేహాదులయందు కర్మవత్త్వమును చూచుటను ప్రశంసించు నీ క్రింది శ్లోకములోని గభీరభావమును గుర్తించుకొనవలయును.]

కర్మణ్యకర్మయః పశ్యే దకర్మణి చ కర్మ యః
సబుద్ధిమాన్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్. 18

(యః) ఎవడు, (కర్మణి) కర్మకలది వలె కన్పట్టు ఆత్మ యందు, (అకర్మ) నిష్క్రియత్వమును,(పశ్యేత్) చూచునో, (అకర్మణి) నిష్క్రియత్వముతో నున్నట్లు కన్పట్టు దేహము నందు, (కర్మచ) కర్మకలిగియుండుటను,(పశ్యేత్)చూచునో, (సః) వాడు,(మనుష్యేషు) మనుష్యులయందు, (బుద్ధిమాన్) బుద్ధిమంతుడు, (సః) వాడు, యుక్తః యోగి, (కృత్స్నకర్మ కృత్) సమస్తకర్మను చేసినవాడు.

ఈ ప్రకారముగా నెవడు ఆత్మ కర్తకాదని తెలిసి కొనునో వానికి కామసంకల్పాదు లుండనేరవు. వాడు దేహముతో చేయు కర్మలన్నియు దహింపబడును. అనగా వాని ఫలములను నాత డనుభవింపడు. అవివానిని బంధింపనేరవు. 19 అట్టివాడు అప్రయత్నముగా, అయాచితముగా తనకులభించు నాహారముతో తృప్తుడగును. అట్టివాడు యజ్ఞకర్మను చేయ నక్కర లేదు. ఒకవేళ నాతడు శారీరకప్రకృతిని బట్టి యజ్ఞ కర్మ చేయుచో యజ్ఞమంతయు బ్రహ్మముగనే భావించును.

బ్రహ్మార్పణం బ్రహ్మ హవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా. 24

(అర్పణం) ద్రవ్యమును అగ్నిలో వేల్చుటకు సాధన మైన స్రుక్స్రువాదికము, (బ్రహ్మ) బ్రహ్మము, (హవిః)

# పంచమాధ్యాయము

## సన్యాసయోగము

కర్మయోగాభ్యాసముచేసి యంతఃకరణశుద్ధిని, ఇంద్రియజయమును సంపాదించుకొన్న జ్ఞాని సర్వభూతాత్మ భూతాత్ముడగును: అనగా తనలోని ప్రత్యగాత్మయే సర్వ భూతములలోను నుండు ఆత్మయని యనుభవములో గ్రహిం చును. అట్టివాడు లోకసంగ్రహార్థమై యేమిచేసినను లిప్తుడు కాడు.8 వాని జ్ఞానకర్మేంద్రియము లేమిచేసినను కర్తృత్వ మును తనయం దారోపించుకొనడు.9 ఇంకను జ్ఞానమును పొందక క్రొత్తగా కర్మయోగసాధనమునకు పూనినవాడు ప్రయత్నపూర్వకముగా సమస్తకర్మలను బ్రహ్మమం దర్పిం చుచో నీటిచే తామరాకు స్పృశింపబడనట్లు కర్మఫలముచే స్పృశింపబడడు.10 యోగులు అంతఃకరణశుద్ధికై మమకార రహితులయి మనోబుద్ధిశరీరములచేత కర్మ చేయుదురు." ఇట్టి సాధనచే క్రమముగా పరమార్థ దర్శనము గల్గినవాడు సర్వ కర్మలను-విహితకర్మలను, నిషిద్ధకర్మలను, కామ్యకర్మలను విడిచిపెట్టి ప్రారబ్ధకర్మక్షయమగువఱకు నీదేహమందే యుండును. 13

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ
నవద్వారే పురే దేహే నైవ కుర్వ న్నకారయన్. 13

(వశీ) ఇంద్రియనిగ్రహముగల జ్ఞాని, (నవద్వారే) రెండు నేత్రములు, రెండు శ్రోత్రములు, రెండు నాసారంధ్రములు, నోరు, మూత్రపురీషద్వారములు-అను తొమ్మిది ద్వారములుగల, (పురే) పురమువంటి, (దేహే) దేహమందు (నైవకుర్వన్) ఏమియు చేయనివాడై, - చేయించుచున్నానను భావములేనివాడై - (నకారయన్) ఇంద్రియములచే నేమియు చేయింపనివాడై - చేయించుచున్నానను భావములేనివాడై - (మనసా) వివేకబుద్ధిచేత, (సర్వకర్మాణి) సర్వకర్మలను (సన్న్యస్య) విడిచిపెట్టి, (ఆస్తే) ఉండును.

[మనమొక పట్టణములో నున్నచో పట్టణమే మన మను అభిప్రాయము మనకు లేదు. కాని దేహములోనున్న మనము దేహముతో తాదాత్మ్యమును పొందుచు, సుఖ దుఃఖాదు లనుభవించుచున్నాము. జ్ఞాని యట్లుకాదు. అతడు దేహములో, పట్టణములోవలెనే యుండి, దేహతాదాత్మ్యము లేనివాడై ఆత్మానంద మనుభవించుచుండును. కావుననే యాతడు "పురమువంటి దేహములో నుండు" నని పై శ్లోకములో చెప్పబడినది. ఈ జ్ఞానికి ఆత్మభావమే కల్గుచో ఆత్మ సార్వత్రికము గాన నీత డంతటను నున్నట్లు చెప్పవలయును గాని దేహమందున్నట్లేల చెప్పవలయుననః చూచువారికి ఆ సార్వత్రికమైన యాత్మ గోచరించుటలేదు; ఈ దేహములో ఆత్మజ్ఞాని యున్నట్లు మాత్రము ఎల్లరకు తెలియగలదు. ఒక

రాజు (తనశక్తిచేత) రాజాధికృతులైన మంత్రులు, మండలాధికారులు, గ్రామాధికారులు మున్నగువారిలో దేశమందంతటను వ్యాపించియున్నను ఆతడు తనపురములో నితరులకు లభ్యమగుచున్నట్లే, యీ యాత్మజ్ఞానియు అంతటను ఆత్మభావ మనుభవించుచు, నితరులకు ఈదేహములో ఉపలభ్యుడగుచుండుటచే నీ పై శ్లోకములోని భావము బహురసవత్తరమును, గంభీరమునై యున్నదని గుర్తింపవలయును.]

ఇట్లు దేహమునుండి ఆత్మను వేరుగా తెలిసికొనుటయే జ్ఞానము. ఈ జ్ఞానము గలవాడు కర్తృత్వ భోక్తృత్వాదులు తనకు లేవని తెలిసికొనును. పరమాత్మకు కర్తృత్వాదులులేనిచో జగత్తెట్లు సృష్టింపబడినదని ప్రశ్నవచ్చును. అది మాయాకార్యము. నిర్వికారమైన బ్రహ్మలో జగదాది వికారము లున్నట్లు మనకు గల్గించునదే మాయ. దానికే అవిద్యయని పేరు. ఉన్న పదార్థ మొక్కటేయనియు, అదియే ఆత్మయనియు చెప్పుదానికి, ఆత్మను మరుగుపరచు మాయ యొకటికూడ యున్నదని చెప్పుదానికి వైరుధ్యము లేదాయనః లేదు. ఆత్మ దర్శనము చేసినవానికి అవిద్యనశించుచున్నది. కాని అవిద్యలోనున్నవానికి ఆత్మ నశింపదు. సాధనవిశేషములచేతను, గుర్వనుగ్రహముచేతను అజ్ఞాని జ్ఞానియై ఆత్మను దర్శించుట లోకములో కనబడుచున్నది. కావున అవిద్యకు నాశనమున్నది. ఒకసారి బ్రహ్మజ్ఞానము

పొందినవానికి ఆత్మ పరోక్షమగుట సంభవింపదు. కావున ఆత్మావిద్యలు రెండింటిలోను పరమార్థ సత్యము ఆత్మకేగాని అవిద్యకు లేదు.

మాయయొక్క శక్తిచేతనే మనము సత్యమైన ఆత్మనున్నట్లు తెలిసికొనలేకపోవుటయు, దేహాదులయం దాత్మభావమును పొందుటయు సంభవించును. అజ్ఞానమేమిచేయింపలేదు? ఎఱ్ఱగా కాలిన ఇనుపగోళమును చూచి ఈ యినుపగోళము వస్తువులను తగులబెట్టుననుచున్నాము. మరియు దానినే చూచి యీనిప్పు గుండ్రముగా నున్నదనుచున్నాము యాథార్థ్యముచూచినమేని దాహకత్వము(తగులబెట్టుగుణము) అగ్నిదికాని, అయోగోళపుదికాదు;అట్లే వర్తులత్వము అయోగోళపుది కాని అగ్నిదికాదు. భ్రాంతిలో మనము ఒకదాని ధర్మములను మఱొకదానియం దారోపించుచున్నాము, అట్లే మాయాశక్తిచే దేహాత్మల ధర్మములను మనము తలక్రిందుగాగ్రహించుచున్నాము. ఈ యజ్ఞానము వీడినవానికి ఆత్మ ప్రస్ఫుటముగా గోచరించును.]

జ్ఞానేన తు తదజ్ఞానాం యేషాం నాశిత మాత్మనః
తేషా మాదిత్యవజ్ జ్ఞానం ప్రకాశయతి తత్పరం. 17

(యేషాంతు) ఎవరియొక్క, (ఆత్మనః) అంతఃకరణముయొక్క (అజ్ఞానం) అవిద్య, (జ్ఞానేన) ఆత్మజ్ఞానముచేత, (నాశితం) నశింపచేయబడినదో, (తేషాం) వారలయొక్క

(జ్ఞానం) జ్ఞానము, (ఆదిత్యవత్) సూర్యునివలె, (తత్) ఆ, (పరం) పరమార్థ వస్తువును. (ప్రకాశయతి) ప్రకాశింపచేయు చున్నది.

తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః. 17

(తద్బుద్ధయః) ఆ బ్రహ్మమందు బుద్ధిగల్గినవారై, (తదాత్మానః) ఆబ్రహ్మమే తమ యాత్మయని తెలిసినవారై (తన్నిష్ఠాః) బ్రహ్మమందే ఉన్నవారై-సర్వ కార్యములను వీడినవారై-(తత్పరాయణాః) బ్రహ్మమే ఉత్కృష్టమైనగతిగా కలవారైన జ్ఞానులు, (జ్ఞాననిర్ధూతకల్మషాః) జ్ఞానముచేత నశింపచేయబడిన సంసార దోషముకలవారై, (అపునరావృత్తిం) తిరిగి సంసారములో పడనిస్థితిని, (గచ్ఛంతి) పొందు చున్నారు.

[తృతీయ చతుర్థాధ్యాయములలో జ్ఞానముగల్గియు లోకసంగ్రహార్థమై వ్యవహరించువారి దృష్టి వర్ణింపబడినది. ఈయధ్యాయములలో జ్ఞానముగల్గి సర్వకర్మ సన్న్యాసము చేయువారి పరిస్థితి వర్ణింపబడినది. జ్ఞానులీరెంటిలో నేమార్గ మునైనను అవలంబింపవచ్చునని యిదివరకు చెప్పబడి యున్నది. జ్ఞానులలో నిట్టిభేద మెందుల కుండవలయునన్న, అది ప్రారబ్ధమునననుసరించియే యుండునని సిద్ధాంతము. జ్ఞాని కూడ ప్రారబ్ధమును విడువజాలడుకదా? ఇట్టి సన్న్యాసి వ్యవ హారములయిమిత్తమైనను ఆత్మోపాధియైన శరీరమందు దృష్టిని

నిలుపజాలడు. కాని యాతడును చిరకాలవాసనచే నేర్పడిన దేహధారణ కార్యమును చేయుచునేయుండును, యాదృచ్ఛికముగ, అప్రయత్నముగ లభించిన యాహారమును, లేదా భిక్షాటనమువలన సిద్ధించిన దానిని భుజించును. ఇట్టి జ్ఞానులు లోకవ్యవహారరహితులై యుపాధులను పేక్షించి యాత్మను దర్శించుటచే వారిసమదృష్టి యీ క్రిందిరీతిగా వర్ణింపబడినది.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః. 18

(పండితాః) ఆత్మజ్ఞానులు, (విద్యావినయసంపన్నే) విద్యావినయములతోకూడిన, (బ్రాహ్మణే) బ్రాహ్మణునియందును, (గవి) గోవునందును,(హస్తిని) ఏనుగునందును, (శుని) కుక్కయందును, (శ్వపాకేచ) కుక్కమాంసము తినువానియందును, (సమదర్శినః) సమానమైదృష్టిగలవారు.

[ఈశ్లోకము నపార్థము చేసికొనువారు కలరు. ఉపాధిదృష్టివీడి ఆత్మను దర్శించుటకు సంబంధించియే యీ శ్లోకము చెప్పబడినది. కాని వ్యవహారములో నీయన్నిటియందును నొకేరీతిగా నుండవలయుననుటకుకాదు, ఏలయన: వ్యవహారములో భేదభావముండక తప్పదు. ఆవుపై దయ గల్గుచో గడ్డినే వేయవలెను; మానవునిపై దయగల్గుచో మానవాహారమునే పెట్టవలయును; కుక్కకుకంటె ఏనుగునకు ఎక్కువ ఆహారమునే పెట్టవలయును; ఇతరులపట్లకంటె తండ్రియందు

నెక్కువ భక్తినే కనుపఱుపవలయును; ధర్మాచరణములోని విచక్షణను ఈశ్లోకము నివారింపదని గుర్తించుకొనవలయును.]

[ఇట్టి జ్ఞాని జీవించియుండగనే బ్రహ్మానందమును (మోక్షమును) పొందును. ఈతనికి జీవన్ముక్తుడని పేరు. ఇట్టి వాడు కర్మచేయుచున్నను చేయకపోయినను కూడ మరణ పర్యంతము ప్రారబ్ధమును మాత్ర మనుభవించును. మరణ ముతో ఆ బంధముకూడ పోవును. కాన జ్ఞానులకు ముక్తిమరణ ముతో వచ్చుననియు కొన్నిచోట్ల చెప్పబడినది. జీవితకాల ములోనే యీజ్ఞానులు బ్రహ్మమే (బ్రహ్మభూతులు) అగుచు న్నారు. వారికి సమస్తవ్యవహారము ఆత్మలోనే జరుగును.]

యోఽన్తస్సుఖో న్తరారామ స్తథాంతర్జ్యోతిరేవయః
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి. 24

(యః) ఎవడు, (అంతస్సుఖః) లోపలనే సుఖముగల వాడో, (యః) ఎవడు, (అంతరారామః) లోపలనే క్రీడించు వాడో, (తథా) అట్లే, (అంతర్జ్యోతిరేవ) లోపలనే వెలుగు గలవాడో, (సః) అట్టి, (బ్రహ్మభూతః) బ్రహ్మమేయైపోయిన, (యోగీ) యోగి, (బ్రహ్మనిర్వాణం) బ్రహ్మానందమును, (అధిగచ్ఛతి) పొందును.

వాడు కన్నులు మూసికొనినప్పుడు మాత్రమే యీ బ్రహ్మానందము ననుభవించునని దీని యర్థము కాదు. అంత టను వాడిట్టి యానందమునే యనుభవించును.

అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనాం 26

(విదితాత్మనాం) ఆత్మను తెలిసికొన్నవారికి (అభితః) అంతటను, (బ్రహ్మనిర్వాణం) బ్రహ్మానందము, (వర్తతే) ఉండును.

[మాయకును, మాయా కార్యములకును పారమార్థిక సత్యత్వము లేకపోయినను వ్యావహారిక సత్యత్వమున్నదని గుర్తింపవలయును. మాయా కార్యమైన అగ్నికి మాయాకార్యమైన మన చేయి తగులుచో బాధ కలుగకపోదు. జాగ్రదవస్థాదృష్టితో చూచినచో స్వప్నవిషయమునందు సత్యత్వము లేకపోయినను స్వప్నములో పాము కన్పట్టుచో నపుడు భయము కల్గుచునేయున్నది. అట్లే మాయాధిపతియు, జగత్కర్తయునైన పరమేశ్వరు నారాధించుచో మాయావశులై యున్నవారి కందరకును ఇష్టఫలసిద్ధి కల్గుచునే యుండును. పారమార్థికముగా ఉండక వ్యావహారికముగా నుండుటచేతనే జగత్తును మిథ్య యందురు. మాయాదృష్టి నతిక్రమించి వెళ్ళగల్గినవారికి నిరాకారనిర్గుణబ్రహ్మము గోచరించునని మాత్రమే తెలిసికొనవలయును, అట్లతిక్రమించుటకు కూడ పరమేశ్వరుని సహాయ ముండవలయునని పైని చెప్పబడినది. ఒక్కొక్కప్పుడు స్వప్నములోగల్గిన యొక సంఘటనము వలననే మెలుకువ వచ్చునట్లు మాయాంతర్భూతములైన గురుసేవా గురుబోధాదుల వలనను, వివిధములైన పరమేశ్వరోపాసనల వలనను ఆత్మజ్ఞాన ముదయించును. కావున వైకుంఠకైలాసాది పుణ్యలోకముల కేగుటకైనను

నిరాకార పరమాత్మానుభూతి పొందుటకైనను పరమేశ్వరు నుపాసింపవలసియున్నది.]

భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోక మహేశ్వరం
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వామాం శాంతిమృచ్ఛతి 29

(యజ్ఞతపసాం) యజ్ఞములకును తపస్సులకును, (భోక్తారం) అనుభవించు వాడైనట్టియు-(సర్వలోక మహేశ్వరం) అన్ని లోకములకు సర్వోత్కృష్టప్రభువైనట్టియు, (సర్వభూతానాం) అన్ని ప్రాణులకును (సుహృదం) ప్రత్యుపకారాపేక్ష లేక యే ఉపకారము చేయునట్టియు, (మాం) నన్ను, (జ్ఞాత్వా) తెలిసికొని (శాంతిం) మోక్షమును, (ఋచ్ఛతి) మానవుడు పొందును.

—:O:—

# షష్ఠాధ్యాయము

## ఆత్మసంయమయోగము

[ఇంద్రియములను బాహ్యవ్యాపారములనుండి విరమింపచేసి మనస్సున కేకాగ్రతను గూర్చుకొని పరమేశ్వరుని ధ్యానించుట యనుదానికి యోగమని పేరు. యోగమున కిది వఱకు చెప్పబడిన "సమబుద్ధి" "కర్మకౌశలము" అను అర్థములకంటె నది వేరైనది, ఈ యధ్యాయములో చెప్పబడిన యోగము పతంజలిమహర్షి రచించిన యోగసూత్రములలో వివరింపబడినది. కావున నీయోగమును పాతంజలయోగమందురు. పాతంజలయోగమును గూర్చిన స్థూలమైన ప్రశంసయే యీ యధ్యాయములో నున్నది. కాని యిందు యోగము యొక్క వివరములు లేవు. కావున యోగాభ్యాసము చేయ దలచినవారు యోగశాస్త్రమును గురువులవలన తెలిసికొని యలవరచుకొనవలయుననిగాని స్వతంత్రముగ నలవరచుకొనుటకు యత్నింపరాదు. ఈ యధ్యాయమునకు "ధ్యానయోగ"మను పేరు కొన్నిప్రతులలో వాడబడినది. గడచిన నాలుగధ్యాయములలోను చిత్తమును పలువలు విషయములపై పోనీయరాదనియు పరమేశ్వరుని పైననే లక్ష్యముంచవలయుననియు, శాంతికదియే మార్గమనియు చెప్పబడుటచే దానికి సాధనమైన ఆత్మసంయమము-అనగా మనస్సుతో

కూడిన పంచేంద్రియములను నిగ్రహించి పరమేశ్వరాభిముఖముగా చేయు యోగము ఈ యధ్యాయములో చెప్పవలసిన యావశ్యకత గల్గినది.

ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే
యోగారూఢస్య త స్యైవ శమః కారణ ముచ్యతే. 3

(యోగం) ధ్యానమును (ఆరురుక్షోః) అధిష్ఠింపదలచిన- పొందదలచిన-(మునేః) పరమేశ్వరుని మననముచేయు స్వభావముగలవానికి, (కర్మ) శాస్త్రవిహితమైన కర్మ-నిత్యనైమిత్తికకర్మలు, కామ్యకర్మకంటె నితరమైనవి, (కారణం) సాధనముగా చెప్పబడుచున్నవి. (యోగారూఢస్య) ధ్యానములో ప్రావీణ్యముపొందిన, (తస్యైవ) వానికే (శమః) సర్వకర్మలనుండియు విరమించుట (కారణం) సాధనము.

[నిశ్చలమైన ధ్యానమునభ్యసించుకాలములో శాస్త్రీయనిత్యనైమిత్తిక కర్మలు చేయదగినవేయనియు, ధ్యానము కుదిరినపిమ్మట కర్మలు ధ్యానమున కాటంకమును గల్గించునవగుటచే వానిని విడిచిపెట్టవలయుననియు దీనిభావము. కర్మలనే విడువవచ్చునని చెప్పినప్పుడు కామములను సంకల్పములను వీడవలయునని చెప్పనేల? అయినను చెప్పుచున్నాడుః-

యదా హి నేంద్రియార్థేషు నకర్మస్వనుషజ్జతే
సర్వసంకల్పసన్యాసీ యోగారూఢ స్తదోచ్యతే. 4

యోగి (యదా) ఎప్పుడు, (ఇంద్రియార్థేషు) శబ్దాది విషయములయందును, (కర్మసు) కర్మలయందును, (నాను

షజ్జతే) తగులుకొనఁడో, (సర్వసంకల్పసన్యాసీ) అన్నిసంకల్పములను వీడినవాఁడగునో, (తదా) అప్పుడు, (యోగారూఢః) యోగారూఢుడని, (ఉచ్యతే) చెప్పబడును.

[పరమేశ్వరుడు మనకుప్రసాదించిన యీపవిత్రదేహము నిట్లు యోగసాధనచే ఆత్మానందప్రాపకముగా చేసికొన వచ్చును. అట్లుకాక దీనిని పాపకార్యములకు వినియోగింతుమేని యిది మనలను నరకములకు నడపి శత్రువుగా పరిణమించును.]

ఉద్ధరేదాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః. 5

(ఆత్మానం) తన్ను (ఆత్మనా) తనచేతనే, (ఉద్ధరేత్) ధ్యానయోగమునొంది ఉద్ధరించుకొనవలయును, (ఆత్మానం) తన్ను, (నావసాదయేత్) నశింపచేసికొనరాదు, (ఆత్మైవ) తానే (ఆత్మనః) తనకు, (బంధుః) బంధువు, (ఆత్మైవ) తానే (ఆత్మనః) తనకు (రిపుః) శత్రువు.

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః. 8

(జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా) శాస్త్రజ్ఞానము చేతను, దాని ననుభవములోనికి తెచ్చుకొనుటచేతను, తృప్తినొందిన అంతఃకరణ కలిగినట్టియు, (కూటస్థః) సుఖ దుఃఖములచే చలింపనట్టియు, (విజితేంద్రియః) ఇంద్రియములను జయించినట్టియు, (సమలోష్టాశ్మకాంచనః) సమానమైన మట్టిబెడ్డ రాయి

బంగారము గలినట్టియు - లోష్టాదులయందు సమబుద్ధిగల్గి నట్టియు, (యోగీ) యోగి, (యుక్తఇతి) చిత్తైకాగ్రతకలవాడని, (ఉచ్యతే) చెప్పబడును.

[ఇట్టి యుత్తమస్థితి గల్గుటకై ఈక్రిందిరీతిగా నభ్యాసము చేయవలయును;]

యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః. 10

(యోగీ) ధ్యానించువాడు, (ఏకాకీ) ఒక్కడే (రహసి) రహస్యమందు, (స్థితః) ఉన్నవాడై, (యతచిత్తాత్మా) నియమింపబడిన అంతఃకరణము, దేహముకలవాడై, (నిరాశీః) కోరికలు లేనివాడై, (అపరిగ్రహః) ఏమియు నితరులవలన తీసికొననివాడై, (సతతం) ఎల్లప్పుడు, (ఆత్మానం) అంతఃకరణమును, (యుంజీత) ఏకాగ్రము చేయవలయును.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరం. 11
తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే. 12
సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్. 13
ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః
మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. 14

పై శ్లోకముల భావము:-

పరిశుద్ధమైన ప్రదేశములో కదలని ఆసనమును మిక్కిలి ఎత్తుగాగాని మిక్కిలి పల్లముగాగాని లేకుండునట్లు

వేసికొనవలయును. అడుగున కుశలను, ఆపైన కృష్ణాజినమును ఆపైన వస్త్రమును వేసి యాసనమును నిర్మించుకొనవలయును. మనస్సును ఏకాగ్రముగానుంచుటకు ప్రయత్నించుచు, చిత్తమును, ఇంద్రియములను, శరీరమును ఏకాగ్ర్యములోను ప్రవర్తింపకుండునట్లు చేయుచు నా యాసనముపై కూర్చుండి అంతఃకరణశుద్ధికొఱకు యోగమును — చిత్తైకాగ్రతను — కూర్చుకొనవలయును. శరీరమును, శిరస్సును, మెడను వంకరలేకుండునట్లుంచి, చలింపనివాడై, స్థిరుడై, నాసికాగ్రమును చూచుచున్నవాడువలెనుండి, తనను కాని, దిక్కులను గాని చూడనివాడై, మిక్కిలి శాంతమైన అంతఃకరణముగల వాడై, భయమును వీడినవాడై, బ్రహ్మచర్యము నవలంబించినవాడై, మనస్సును నిగ్రహించి, నాయందే చిత్తగలవాడై నేనే పరమగమ్యుడనని తలచుచున్నవాడై యోగమందుండ వలయును.

[యోగులు కొందరు శరీరమును స్వాధీనముచేసికొని మనస్సును నిగ్రహించుటనుకూడ నభ్యసించి తుచ్ఛభోగములకొఱకై వాని నుపయోగించుట కలదు. పవిత్రమైన యీ యోగవిద్యను పరమేశ్వరుని తెలిసికొనుటకే యుపయోగింపవలయునని చివరి శ్లోకమువలన తెలియుచున్నది. ఈ యోగాభ్యాసకాలములో యోగి దినమునకు కొంత కాలముమాత్రమే యభ్యాసము చేయగలడు. అయినను నిరంతరము చిత్తైకాగ్రతను సాధించుటయందే దృష్టి నిడి కొనవలయును. ఇంద్రియములు ఆ యా విషయములపైకి

ప్రసరించుచో ప్రయత్నపూర్వకముగా వాని నరికట్టి ఆత్మ చైతన్యమునందే ప్రసరింప చేయవలయును. ఈ భావము ఈ క్రింది శ్లోకములో కలవు.]

యతో యతో నిస్సరతి మన శ్చంచల మస్థిరం
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్. 26

[మోక్షము జ్ఞానమువలననే సిద్ధించును. అట్టిచో నీ పాతంజల యోగశాస్త్రము నాశ్రయింప వలయుననుటకు కారణమేమన: అంతః కరణము మలినముగా నున్నంత కాలము జ్ఞాన ముదయింపదు. ఇంద్రియనిగ్రహము వలనను, ఆత్మచింతనమువలనను అంతఃకరణ మాలిన్యము నశించును; జ్ఞానోదయమగును. సంపూర్ణమైన ధ్యానశక్తి గలవాడు తత్కాలికముగా బాహ్య చింతలను చంపుకొని యాత్మానందము ననుభవింపగలడు. జ్ఞానమువలన నొకసారి యాత్మానందము గల్గుచో నిక దానికి తిరుగులేదు; కాని యోగ ధ్యానమువలన గల్గు ఆత్మానందము ధ్యాన మంతమగుటతో ముగిసి పోవును. కావున జ్ఞానము వలన గల్గినయానందము గొప్పది. అయినను, తరచుగా యోగాభ్యాసము చేయువానికి ధ్యానము క్రమముగా సహజమై సర్వకాలములయందును నిలచు నాత్మానందమును గూర్చు జ్ఞానము గల్గుటకు కారణమగును.]

ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖము త్తమం
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషం. 27

(ప్రశాంతమనసం) శాంతమైన మనస్సు గల్గినట్టియు (శాంతరజసం) నాశనమైన రజస్తమోగుణములు గల్గినట్టియు (బ్రహ్మభూతం) జీవన్ముక్తుడైనట్టియు, (అకల్మషం) ధర్మాధర్మముల కతీతుడైనట్టియు, (ఏనం) ఈ, (యోగినం) యోగిని (ఉత్తమం) గొప్పదైన, (సుఖం) బ్రహ్మానందము, (ఉపైతి) పొందును.

ఇట్టివానికి తనలోనున్న యాత్మయే సర్వభూతముల యందును ఉన్న యాత్మయను ననుభవము గల్గును.

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. 22

(యోగయుక్తాత్మా) యోగముచే ఏకాగ్రతను పొందిన చిత్తముగలవాడు, (సర్వత్ర) అంతటను, (సమదర్శనః) సమానమైన దృష్టికలవాడై, (ఆత్మానం) తనను, (సర్వభూతస్థం) సర్వభూతములయందు నున్నవానిగాను, (సర్వభూతాని) సర్వభూతములను, (ఆత్మని) తనయందున్న వానినిగాను, (ఈక్షతే) చూచును.

సర్వభూతములను ప్రేమించుచు తన సుఖదుఃఖము లెట్టివో యితరులవికూడ నట్టివేయని యోగభ్యాసపరుడు భావించుచు అహింసను, దయను అవలంబింపవలయును. 32

"చంచలమైన మనస్సు నింతగా నిగ్రహించుట సాధ్యమా?" యని యర్జునునకు సందేహము గల్గును.

అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను అది సాధ్యమగునని పరమేశ్వరుడు స్పష్టపఱచుచున్నాడు.

అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలం
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణచ గృహ్యతే. 35

అంత అర్జునునకొక గొప్ప సందేహముగల్గును. ఆతడు భగవాను నిట్లడుగును:-

"ఓకృష్ణా! యోగాభ్యాసమునకు పూనువాడు కామ్య కర్మలను వీడి నిత్యనైమిత్తికకర్మలనే చేయవలయునని చెప్పి నావు. అట్టివాడు యోగాభ్యాసములో కృతార్థుడు కాక పోయినచో, వానికి ఇటు కామ్యకర్మలవలన గల్గు స్వర్గైశ్వ ర్యాదులును, అటు యోగములవలన గల్గు ఆత్మానందమును కూడ లేకపోవునుగదా! వా డుభయభ్రష్టు డగునని నాకు తోచుచున్నది. నా సందేహమును తీర్పుము."

అంత భగవానుడు ఇట్లు చెప్పును:

పార్థ! నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే
నహి కల్యాణకృ త్కశ్చి ద్దు ర్గతిం తాత! గచ్ఛతి. 40
ప్రాప్య పుణ్యకృతాన్లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. 41
అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశం. 42
తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన! 43

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపిసః
జిజ్ఞాసురపి యోగస్య శబ్ద బ్రహ్మాతివర్తతే. 44

ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః
అనేక జన్మసంసిద్ధ స్తతో యాతి పరాంగతిం. 45

ఈ శ్లోకముల భావము:-

నాయనా అర్జునా! ఆత్మదర్శన మను కల్యాణ కార్యము చేయబూనిన వాడెన్నటికిని చెడిపోడు, యోగ మందు స్థిరప్రజ్ఞను సంపాదించుకొనుటకు పూర్వమందే మర ణించినను వాడు చేసిన సాధనము వ్యర్థముకాదు. దానికి ఫలి తముగా వాడు మరణానంతరమందు కామ్యకర్మలను చేయు వారి కేపుణ్యలోకములు వచ్చునో అట్టి పుణ్యలోకముల కే పోయి చిరకాల మచట నివసించి తిరిగి యీలోకములో పవి త్రులైనట్టియు, శ్రీమంతులైనట్టి వారియింట జన్మించును. (ఐశ్వర్యముగల్గి పవిత్రతలేనివాడు పాపములు హెచ్చుగా చేయును; అట్లే పవిత్రకలిగి ఐశ్వర్యములేనిచో శోకవ్యాదు ధనలోభముచే పవిత్రత సడలవచ్చును. కావున పవిత్రులైన ఐశ్వర్యవంతులయింట జన్మ గొప్పదిగా భావింపబడినది.) లేదా దరిద్రులేయై స్థిరమైన బుద్ధిగల యోగులయింట జన్మిం చును. ఇట్టి జన్మ కల్గుటకష్టము. అక్కడ వానికి పూర్వజన్మ సంబంధమైన యోగాభిలాషయు, యోగబుద్ధియు కలుగును; తిరిగి యాతడు పూర్వజన్మకృషినే చేయును. పూర్వజన్మా భ్యాసముచే వాడు బలాత్కారముగా యోగాభ్యాసమున

కనుకూలముగా నాకర్షింపబడును. ఈ రీతిగా యోగి కొన్ని జన్మములయందు తన ప్రయత్నమును సాగించి, ఒక జన్మములోకంటె నొక జన్మములో అంతఃకరణశుద్ధిని గల్గించుకొనుచు, చిత్తైకాగ్రతను క్రమముగా నలవరచుకొనుచు, తుదకు బ్రహ్మానందమును (మోక్షము) పొందును. కావున యోగి మోక్షమును పొందనంతవఱకు సకామకర్ములు పొందెడి స్వర్గాది పుణ్యలోకములను, ఐశ్వర్యములను పొందుచునే యుండును. అంతియేకాక మోక్షమార్గములో కొంతముందుకు నడచినవాడుకూడ నగుటచే నతడు సకామకర్మునికంటె నధికుడని చెప్పవలయును.

[ఇక్కడపాతంజలయోగ విషయములో చెప్పబడినది సమస్తయోగములకును వర్తించును. సత్కార్యముల నాచరించు మానవుడు మరణమువలనకాని మఱి యేవిధమైన విఘ్నమువలనగాని తన కృషి వ్యర్థమైపోవునని భయపడనక్కఱలేదు. చేయబడిన కర్మ యేదియు నశింపదు. అట్లే సత్కర్మ చేయకుండ ఏసత్ఫలములను రాదు. కృతప్రణాశము, అకృతాభ్యాగమము శాస్త్రవిరుద్ధములు, కావున మానవుడు నిరంతరము కల్యాణ సంకల్పములతోనుండి కల్యాణ కార్యములను పూనుచుండవలయును, మన ప్రకృతియు, కర్మసంస్కారమును జన్మజన్మలకును మనల ననుసరించుచునే యుండును. కావున కల్యాణ కర్మలు చేయువానికి క్రమాభివృద్ధియు, చివఱకు మోక్షమును తప్పవు.]

యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా
శ్రద్ధావాన్ భజతేయోమాం స మేయుక్తతమో మతః.47

(సర్వేషామపియోగినాం) యోగులందరిలోను, (యః) ఎవడు (శ్రద్ధావాన్) శ్రద్ధగలవాడై, (మద్గతేన) నన్ను పొందిన, (అంతరాత్మనా) అంతఃకరణముచేత, (మాం) నన్ను (భజతే) సేవించునో, (సః) వాడు, (మే) నాకు, (యుక్తతమః) సర్వోత్కృష్టయోగిగా, (మతః) అంగీకరింపబడినవాడు.

[ఇంద్రియనిగ్రహ మలవఱచుకొని కేవల చిత్తశాంతిని పొందుటకు యత్నించువారికంటె నట్టి నిర్మలాంతఃకరణములో నన్ను ధ్యానించువాడు నాకధికప్రియు డని భగవానుడిట చెప్పుచున్నాడు. నిష్కామత్వమువలన, నిస్సంగత్వమువలనను ఎంత శాంతివచ్చినను, యథార్థమైన శాంతి-ఆనందముతో కూడినశాంతి-పరమేశ్వర ధ్యానమువలనను, ఆత్మదర్శనమువలనను గల్గును. ఈశ్వరభావముయొక్క యీ ప్రాముఖ్యము కర్మయోగమునకును వర్తించును. సాధకుడు నిష్కామముగా కర్మచేసిన చాలదు. ఈశ్వరార్పణబుద్ధిని కూడ కల్గియుండవలయును. మాయలోనుండి బాధపడు జీవు నుద్ధరించుటకు మాయాతీతుడైన పరమేశ్వరుడు అనుగ్రహపూర్వకముగా చేయిచాచుటకు సంసిద్ధుడనియు, జీవు డా హస్తావలంబమునకై పరితపించి పరమేశ్వరు నుపాసించుట యవసరమనియు గుర్తెరుంగవలయును.]

—:o:—

# సప్తమాధ్యాయము

——

## విజ్ఞానయోగము

ఇంతవఱకు విపులముగా ఉపదేశింపబడిన నిష్కామ కర్మమను సాధనముకాక మరియొక సాధనము ఆఱవయధ్యాయములో సూచింపబడినది. అది ధ్యాన మనెడు సాధనము. నన్ను ధ్యానించువాడు నన్ను చేరునని పరమేశ్వరు డాఱవ యధ్యాయములో చెప్పినాడు. కావున నిప్పుడు పరమేశ్వరు నేరూపములో ధ్యానింపవలయునో చెప్పవలసియున్నది. అందులకే యీయధ్యాయ మారంభింపబడినది.

[సచ్చిదానంద స్వరూపమైన పరమాత్మను అంతటను దర్శించుట జ్ఞానము. పరమాత్మనుండి యీనశ్వర జగత్తులోని వివిధపదార్థము లెట్లుత్పన్నములైనవో తెలిసికొనుట విజ్ఞానము. ఆత్మ అక్షరము. (నాశములేనిది) ప్రకృతిలోని సమస్తము క్షరము. క్షరము, అక్షరము అనువాని విచార మీ యధ్యాయమునను ఎనిమిదవ యధ్యాయములోను చేయబడినది. ఈ యధ్యాయమునకు విజ్ఞానయోగమనియు, తరువాతి యధ్యాయమునకు క్షరాక్షర విభాగయోగమనియు పేర్లు.]

తన్ను సేవించువాడు తనకు ప్రియతము డని పూర్వాధ్యాయములో పరమేశ్వరుడు చెప్పియున్నాడు. పరమేశ్వరు నెట్లు దర్శింపవలసినదియు నిపుడు చెప్పబడుచున్నది.

భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా.

(భూమిః) పృథివి, (ఆపః) జలము (అనలః) అగ్ని, (వాయుః) వాయువు, (ఖం) ఆకాశము, (మనః) మనస్సు, (బుద్ధిరేవచ) బుద్ధి, (అహంకారః) అహంకారము-(ఇతీయం) ఈలాగు ననెడి, (మే) నాయొక్క, (ప్రకృతిః) ప్రకృతి, (అష్టధా) ఎనిమిది విధములుగా, (భిన్నా) వేరైనది.

[ద్వితీయాధ్యాయ ప్రారంభములో ప్రకృతికి 24 తత్త్వములు చెప్పబడినవి. అదియే పరమేశ్వరుని ప్రకృతి, లేక మాయ, ఆ ప్రకృతి యిచట ఎనిమిది విధములుగా నున్నట్లు చెప్పబడినను, రెంటికిని వైరుద్ధ్యము లేదు. ఎట్లన పై శ్లోకములో మొదట వరుసగా అయిదు సూక్ష్మభూతములు, అనగా పంచతన్మాత్రలు చెప్పబడినది. వాని వికారములే పంచభూతములు కావున అవి చెప్పబడలేదు. అట్లే పంచ జ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు కూడ వీనిలో అంతర్భూతములే యగుటచే చెప్పబడలేదు. ఇట్లు 23 తత్త్వములకు యిందు గ్రహణము కలిగినది. 24 వ తత్త్వము ప్రకృతియే యగుటచే వేరుగ చెప్పబడలేదు. అచట మహత్తు అని చెప్పబడినదే యిచట బుద్ధి యని చెప్పబడినది. ఈ 8 విధములుగా నున్నది పరమేశ్వరునియొక్క నికృష్ట ప్రకృతి అనగా ప్రాణులకు సంసారబంధమును కల్గించునది.]

అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతేజగత్.

ఓమహాబాహూ (ఇయం) పూర్వము చెప్పబడినది. (అపరా) నికృష్టప్రకృతి, (ఇతః) దీనికంటె (అన్యాం) ఇతరమైన (మే) నాయొక్క (పరాం) ఉత్కృష్టమైన - శుద్ధమైన (జీవభూతాం) ఆత్మభూతమైన (ప్రకృతిమ్) ప్రకృతిని, (విద్ధి) తెలిసికొనుము (యయా) ఏ ఉత్కృష్టప్రకృతిచేత (ఇదం) ఈ (జగత్) జగత్తు, (ధార్యతే) ధరింప చేయబడుచున్నదో.

ప్రాణుల ప్రాణధారణహేతువైన యీ శక్తియే క్షేత్రజ్ఞుడనియు చెప్పబడును. 'అపర' ప్రకృతియే క్షేత్రమనియు చెప్పబడును.

[13 వ అధ్యాయములో దీని వివరములు కలవు.]

కావున సమస్తభూతములు ఈరెండు ప్రకృతుల నుండియు బయలుదేరినవని తెలిసికొనవలయును. జడపదార్థమంతయు నికృష్టప్రకృతినుండియు, చేతనమంతయు 'పర' ప్రకృతినుండియు వచ్చినవి. కావున లోకముల ఉత్పత్తి ప్రళయములకు నేనే కారణభూతుడను,

మత్తః పరతరం నాన్య త్కించిద స్తి ధనంజయ!
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. 7.

ఓ ధనంజయా (మత్తః) నాకంటె (పరతరం) ఉత్కృష్టమైనది, (కించిత్) ఏదియు, (అన్యత్) ఇతరమైనది, (నాస్తి)

లేదు. (సూత్రే) సూత్రమునందు (మణిగణాఇవ) మణులసమూహములువలె, (ఇదం) ఈ, (సర్వం) సమస్తజగత్తు, (ప్రోతం) కూర్చబడినది.

ఎట్లనగా :

రసోఽహ మప్సు కౌంతేయ! ప్రభాస్మి శశిసూర్యయోః
ప్రణవ స్సర్వవేదేషు శబ్దం ఖే పౌరుషంనృషు. 8

ఓ కౌన్తేయా, (అహం) నేను, (అప్సు) ఉదకముల యందలి, (రసః) సారముగాను, (శశిసూర్యయోః) చంద్ర సూర్యులయందలి, (ప్రభా) కాంతిగాను, (అస్మి) ఉన్నాను. (సర్వవేదేషు) సమస్తవేదముల యందలి (ప్రణవః) ఓంకారము నేను, (ఖే) ఆకాశమందలి, (శబ్దః) శబ్దము నేను, (నృషు) పురుషులయందలి, (పౌరుషం) పురుషభావము నేను.

[దాహకశక్తి (తగులబెట్టుశక్తి) లేక అగ్ని లేదు; అట్లే కాంతి లేక సూర్యచంద్రులు లేరు. ఇట్లు లోకములో సమస్తవస్తువులు ఆయా వస్తువులు అనిపించుకొనుటకు ఏగుణములు కావలసియున్నవో, ఏగుణములు లేనిచో ఆ యా వస్తువుల కాయావస్తుత్వముే లేదో ఆ యా గుణమెల్ల నేనే యున్నని పరమేశ్వరుడు చెప్పుటచే నతడు సర్వజగత్తునకు ఆధారమని తెలియను. ఆతడు లేనిచో జగత్తునకు జగత్త్వమే లేదని యర్థము. ఆకాశమందలి శబ్దమును నేనని పరమేశ్వరుడు చెప్పినంత మాత్రమున శబ్దమును తెలిసికొనుట చేతనే

పరమేశ్వరుని తెలిసికొనినట్లు కాలేదు. ఆశబ్దమునకు కూడ శబ్దత్వము దేనివలన వచ్చినదో ఆయాధారము కూడ పరమేశ్వరుడే కావున నాయాధారమునుకూడ తెలిసికొనవలయును అట్లే పైనుదహరింపబడిన 5వ శ్లోకములో 'జీవభూతాం' అని చెప్పబడినంతమాత్రమున మనుష్యాది ప్రాణులకు జీవమును గల్గించు ప్రాణమే పరమేశ్వరుడని తలంపరాదు. ప్రాణులు నిలచుటకే ప్రాణము కావలసియున్నదో ఆ ప్రాణమేదో యొకదానిమీద నాధారపడవలయును గదా! అట్టియాదితమాధారమే పరమేశ్వరుడు. ఇట్లు జగత్తులోని యే స్వల్పవిషయము నైనను తీసికొని విమర్శించుచో మనము అడుగడుగునకును సర్వాధార భూతుడైన పరమేశ్వరుని స్మృతికి తెచ్చుకొనుచుండవచ్చును. సత్వరజస్తమోగుణాత్మకమైన ఈమాయను దాటినవాడు కాని సర్వాధారమైన పరమాత్మను దర్శింపజాలడు. ఈమాయను దాటుటకు ఈశ్వర స్మరణ చింతనోపాసనములే సాధనములు.

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే. 14

(దైవీ) దివ్యమైన, (ఏషా) ఈ, (గుణమయీ) సత్త్వరజస్తమోగుణాత్మకమైన, (మమ) నాయొక్క, (మాయా) మాయ, (దురత్యయా) దాట శక్యముకానిది, (యే) ఎవరు, (మామేవ) నన్నే, (ప్రపద్యన్తే) పొందుచున్నారో, (తే)

వారు, (ఏతాం) ఈ, (మాయాం) మాయను, (తరంతి) దాటుచున్నారు.

కావున మానవుడు తరించుటకు పరమేశ్వరసేవకంటెను ముఖ్యమైన సాధనము లేదు. ఈ పరమేశ్వర సేవ మోక్షము కొఱకు మాత్రమే కాక మానవుల సమస్తాభీష్టసిద్ధి కొఱకును ఉపకరించును. రోగముతో బాధపడువాడు రోగనివారణము నకై పరమేశ్వరుని ప్రార్థించుచో రోగము పోవును; ద్రవ్యా దులను కోరువాని కవి వచ్చును; "ఓపరమేశ్వరా! నీ తత్త్వమును నా కెఱింగింపుమ"ని ప్రార్థించువానికి పరమే శ్వరతత్త్వము తెలియును. పరమేశ్వరతత్త్వము తెలిసినవా డితరమునంతను విడచి పరమాత్మచింతనముననే కాలము గడపును. ఈ రీతిగా నాల్గువిధములైనవారు నన్ను భజింతు రని పరమేశ్వరుడు చెప్పుచున్నాడు.

చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతినోఽర్జున !
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ! 16

ఓ అర్జునా, (చతుర్విధాః) నాల్గువిధములైన, (సుకృతినః) పుణ్యాత్ములు (మాం) నన్ను (భజన్తే) సేవించుచున్నారు. ఓభరతర్షభ,—వారెవరనగా—(ఆర్తః) రోగాదుల పీడింప బడినవాడు (అర్థార్థీ) ధనాదులను కోరువాడు, (జిజ్ఞాసుః) నాతత్త్వము నెఱుగగోరువాడు, (జ్ఞానీచ) జ్ఞానియు.

[పైవారిలో జ్ఞాని సర్వోత్కృష్టుడు; జిజ్ఞాసు వా తరు వాతివాడు, వానిదృష్టితో చూచినచో ఆర్తార్థార్థులు తక్కు-

వహారే. కాని యేమానవుడు రోగాదులువచ్చినను పరమే శ్వరుని తన్నివారణకై ప్రార్థింపడో తన న్యాయమైన సంక ల్పములు నెఱవేరుట కీశ్వరుని ప్రార్థించువారు గొప్పవారే. కనుకనే వీరుకూడ పుణ్యాత్ములని యీశ్లోకములో చెప్పబడి నది. ఆర్తులయ్యు, అర్థార్థులయ్యుకూడ పరమేశ్వరుని ప్రార్థిం పని నాస్తికులు రాక్షసప్రకృతి గలవారని పరమేశ్వరుడు చెప్పుచున్నాడు.]

నమాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః 15

[ఉత్కృష్టులైనవారు మాయను తరించు సంకల్పము తో పరమేశ్వరు నుపాసింతురు. కామాత్ములైనవారు ఆయా కోరికలు నెఱవేరుటకై యా యా దేవతల నారాధించు చున్నారు. ఎవడే దేవత నే స్వరూపములో నారాధించినను వానికా యారాధన శ్రద్ధను, ఫలమును నేనే యిచ్చుచున్నా నని పరమేశ్వరుడు చెప్పుచున్నాడు.]

యోయో యాంయాం తనుంభక్తశ్శ్రద్ధయార్చితుమిచ్ఛతి
తస్యతస్యాచలాం శ్రద్ధాం తా మేవ విదధామ్యహం. 21

(యో యః) ఎవడెవడు (భక్తః) భక్తుడై (యాంయాం) ఏయే (తనుం) శరీరమును-దేవతాస్వరూపమును-(శ్రద్ధయా) శ్రద్ధతో,-(అర్చితుం) పూజించుటకు, (ఇచ్ఛతి) కోరుచు

న్నాడో, (తస్యతస్య) వానివానికి (తం) ఆ, (అచలాం) చలింపని (శ్రద్ధాం) శ్రద్ధను, (అహమేవ) నేనే (విదధామి) కలిగించుచున్నాను.

'కాని జరామరణ మోక్షముకొఱకు నన్నే యెవరాశ్రయించి ప్రయత్నించుచున్నారో వారు ఆ బ్రహ్మమును, అధ్యాత్మమును, అఖిలకర్మను తెలిసికొందురు. అధిభూతాధిదైవాదియజ్ఞములతో కూడిన నన్ను తెలిసికొందురు. 20,30

[దీని వివరణము తరువాతి యధ్యాయములో కలదు.]

# అష్టమాధ్యాయము

## అక్షరబ్రహ్మయోగము

[పరమేశ్వరు నీక్రింది యన్ని స్వరూపములలోను తెలిసికొనవలయును: (1) ఉత్కృష్టమై నాశరహితమైన (సప్తమాధ్యాయములో జీవభూతమని చెప్పబడిన) వస్తువు బ్రహ్మమని చెప్పబడును. ఇదియే యక్షరము. (2) ఆత్మమనగా దేహము. అధ్యాత్మమనగా దేహాయందున్నది. ప్రతి ప్రాణి యొక్క దేహమును ఆశ్రయించుకొనియే ప్రత్యగాత్మభావము కలదో దేహములోని పృథగ్భావము ఏదికలదో-అది ఆబ్రహ్మముయొక్క స్వభావమని చెప్పబడును. (3) సమస్తభూతముల ఉనికికి కారణమైన విసర్గము (సృష్టి) ఏదికలదో అది యా బ్రహ్మముయొక్క కర్మయని చెప్పబడును. (4) అధిభూతమనగా: ప్రాణిసమూహములోనున్నది. అదియే నశించుభావము. ఈజగత్తులో నశించునదెల్ల యని యధిభూతము (5) అధిదైవతమనగా: దేవతలరూపము నాశ్రయించుకొని లోపలనుండునది. ఆదియే పురుషుడు ఉదాహరణము: అదిత్య దేవతలోఅంతర్గతుడైయున్న హిరణ్యగర్భుడు. (6) సమస్తయజ్ఞములలో నున్న పరమేశ్వరుడు అధియజ్ఞుడని చెప్పబడును. (7) దేహములో నడచు సమస్తయజ్ఞాది వ్యాపారమునకు అధిదైవతమైనవాడు అధిదేహాయజ్ఞు డనబడును. ఇన్నిరూపములుగా పరమేశ్వరుని భావించువాని

చిత్తసంస్కారము పరిపక్వమగును; సర్వమందును బ్రహ్మ మును చూచుశక్తి యాతనికి కల్గును. ఆ సంస్కారబలము చేత నాతడు మరణసమయమునకూడ పరమేశ్వరునియందే భావముకలిగియుండును. అంత్యకాలమున కెవని కే భావముం డునో వానికి తదనుగుణమైన ఉత్తరగతి యుండును. కావున అట్టివాడు శాశ్వతమైన పరమేశ్వరుని స్థానమునే చేరునని భగ వానుడు చెప్పుచున్నాడు. పైని తెలుపబడిన భావమంతయు నీక్రింది నాల్గు శ్లోకములలో నుపలభ్యమగును:]

అక్షరం బ్రహ్మపరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః. 3

అధిభూతం క్షరోభావః పురుషశ్చాధిదైవతం
అధియజ్ఞోఽహ మేవాత్ర దేహే దేహభృతాంవర. 4

అన్తకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కలేబరం
యః ప్రయాతి స మద్భావంయాతి నాస్త్యత్రసంశయః. 5

యం యం వాపిస్మరన్ భావం త్యజత్యంతే కలేబరం
తం తమేవైతి కౌంతేయ ! సదా తద్భావభావితః. 6

(హే దేహభృతాంవర) ఓ దేహధారులలో శ్రేష్ఠుడైన వాడా, (పరమం) ఉత్కృష్టమైన, (అక్షరం) నాశరహితమైన వస్తువు, (బ్రహ్మ) బ్రహ్మమని చెప్పబడును. (స్వభావః) ప్రత్యగాత్మభావము, (అధ్యాత్మం) అధ్యాత్మమని, (ఉచ్యతే)

చెప్పబడును. (భూతభావోద్భవకరః) సర్వభూతముల యొక్క ఉనికిని గల్గించు, (సర్గః) సృష్టి, (కర్మసంజ్ఞితః) కర్మమను పేరుగలది. (క్షరోభావః) అన్నిభూతముల యొక్క నశించు భావము, (అధిభూతం) అధిభూతమని చెప్పబడును, (పురుషః) సమస్తదేవతలలోనుండు అధిష్ఠానదేవత, (అధిదైవతం) అధిదైవతమని చెప్పబడును. (అధియజ్ఞః) అన్నియజ్ఞములయందును ఉండువాడను, (అహమేవ) నేనే, (అత్రదేహే) ఈ దేహమందుకూడ అధియజ్ఞుడను నేనే.

(యః) ఏవడు, (అంతకాలేచ) మరణకాలమందుకూడ (మామేవ) నన్నే, (స్మరన్) స్మరించుచు, (కలేబరం) శరీరమును, (ముక్త్వా) విడచి (ప్రయాతి) వెళ్లునో, (సః) వాడు, (మద్భావం) పరమేశ్వరతత్త్వమును, (యాతి) పొందును, (అత్ర) ఈవిషయమై, (సంశయః) సంశయము (నాస్తి)లేదు.

ఓకౌన్తేయా! మానవుడు, (యంయం) ఏయే,(భావం వాపి) దేవతను, (స్మరన్) స్మరించుచున్నవాడై, (అంతే) అవసానమందు, (కలేబరం) శరీరమును, (త్యజతి) విడచుచున్నాడో, (సః) వాడు (సదా) ఎల్లప్పుడు,(తద్భావభావితః) ఆ దేవతయందలి భావమే అభ్యస్తవిషయముగా కలవాడై (తం తమేవ) ఆయా దేవతావిశేషమునే, (ఏతి) పొందును.

[అంత కాలమునకు కదా పరమేశ్వరదృష్టి యుండ వలసినదని తలంచి జీవితకాలమును మరొకరీతిగా గడపు

వానికి మరణకాలమున కాదృష్టికలుగనే కలుగదు. జీవితములో చిత్తమేరీతిగా సంస్కృతమగుచుండునో తదనుగుణమైన భావమే మరణకాలమున గలుగును. కావున యావజ్జీవముకూడ చిత్తము నీశ్వరవాసనావాసితము చేసికొనుటకు సర్వవిధముల ప్రయత్నము చేయవలయును.]

కావున, ఓ అర్జునా! నీవు ఈయుద్ధముచేయు సందర్భములోకూడ నన్నే స్మరింపుము. ఎల్లప్పుడును నన్నే స్మరించుచున్నవాడవై నన్నేపొందగలవు. యోగాభ్యాసముచేత నెవడు చివరికాలములో భ్రూమధ్యమందు ప్రాణముంచి మనస్సును హృత్పుండరీకమందు నిరోధించి అక్షరమగు బ్రహ్మను తెలిపెడి ఓంకారమును స్మరించునో వాడు నన్నే పొందును 1?, 12 నన్ను పొందినవాడు దుఃఖాలయమైన జన్మమును తిరిగిపొందడు. 15 నన్నుతప్ప మరి యేలోకమునుచేరినవాడైనను తిరిగి జన్మము నెత్తవలసినదే.

ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున !
మా ముపేత్య తు కౌన్తేయ! పునర్జన్మ నవిద్యతే. 16

ఓ అర్జునా! (ఆబ్రహ్మభవనాత్) చతుర్ముఖబ్రహ్మ నివసించెడి లోకమువఱకుగల, (లోకాః) లోకములు, (పునరావర్తినః) తిరిగి రాక గలవే. (మాముపేత్యతు) నన్ను పొందినవానికన్నను (పునర్జన్మ) తిరిగిజన్మ, (నవిద్యతే) లేదు.

సృష్టి యీరీతిగా నడచుచున్న కాలమునకు ప్రజాపతి యొక్క (చతుర్ముఖబ్రహ్మయొక్క) పగలని పేరు. ఈసృష్టి నశించియుండు కాలమునకు బ్రహ్మయొక్క రాత్రియని పేరు. అనేక సహస్రయుగములు గడచినచో బ్రహ్మకు అహోరాత్ర మగును. విశ్వముయొక్క ఆవిర్భావతిరోభావము లీ రీతిగా నెన్నియో సార్లు జరిగినవి. ఈ వ్యక్తావ్యక్తస్థితులకు పైననే పరమేశ్వరు డుండును. కావున, ఆతని చేరినవారి కీసృష్టి లయములు సంబంధింపవు. 17–20

బ్రహ్మజ్ఞాని మరణాంతరము ఏలోకమునకునుపోక సర్వగతమైన బ్రహ్మతో ఐక్యముచెందుననియు, సత్కర్మల నాచరించువారును ధ్యానయోగులును ఉత్తమలోకముల కేగి తిరిగియీలోకములో జన్మింతురనియు నిదివఱకు చూచియుం టిమి. ఈయధ్యాయములో బ్రహ్మోపాసకులను మరొక తెగ వారి ప్రశంసకలదు. వీరు చిత్తశుద్ధికలిగి, ఇక కర్మయోగ సహాయముకూడ అక్కరలేని స్థితిలోనుండి, బ్రహ్మజ్ఞానము మాత్రము పొందక నిరంతర సగుణబ్రహ్మోపాసన చేయు వారు. వీరిగతియేమనగా: వీరికి జీవితకాలములో బ్రహ్మ జ్ఞానము కలుగకపోయినను, పునర్జన్మమాత్రముండదు. వీరు మరణానంతరము చతుర్ముఖ బ్రహ్మలోకమున కేగి ప్రళయ కాల పర్యంతము అచటనుండి బ్రహ్మవిచారములో కాలము గడుపుచు ప్రళయసమయమున చతుర్ముఖబ్రహ్మతో బాటు

ముక్తినొందెదరు. అనగా అద్వయబ్రహ్మతో నైక్యమొందె దరు. వీరికిని బ్రహ్మవిదులను పేరుకలదు ఇచ్చట విచ్ఛబ్దము ఉపాసకార్థము. ఇతరసందర్భములలో బ్రహవిచ్ఛబ్దము బ్రహ్మజ్ఞానిపరముగా వాడబడినది.

మరణానంతరముఉపాసకు లేమార్గమున పోయి చతు ర్ముఖబ్రహ్మలోకమును చేరుదురో కర్ములు ఏమార్గమున పుణ్యలోకముల కేగుదురో యీ క్రిందిశ్లోకములలో చెప్ప బడినది.

అగ్నిర్జ్యోతి రహశ్శుక్ల షణ్మాసా ఉత్తరాయణం
తత్రప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మ విదోజనాః
ధూమోరాత్రి స్తథాకృష్ణషణ్మాసా ఉత్తరాయణం
తత్రచాంద్రమసంజ్యోతి ర్యోగీప్రాప్య నివర్తతే.

(బ్రహ్మవిదఃజనాః)మరణించినసగుణబ్రహ్మోపాసకులు (అగ్నిః) అగ్న్యభిమాని దేవత, (జ్యోతిః) జ్యోతిరభిమాని దేవత, (అహః) పగటి యభిమాని దేవత, (శుక్లః) శుక్ల పక్షాభిమాన దేవత, (షణ్మాసాః ఉత్తరాయణం) ఆరునెలల ఉత్తరాయణమున కభిమాని దేవత-ఈదేవతలుగల (తత్ర) ఆమార్గమందు,(ప్రయాతాః) వెళ్ళినవారై, (బ్రహ్మ)బ్రహ్మను, (గచ్ఛన్తి) పొందుదురు.

(యోగీ) మరణించిన కర్మయోగి, (ధూమః) ధూమాభిమాని దేవత, (రాత్రిః) రాత్ర్యభిమాని దేవత,

(తథా) అహ్నే, (కృష్ణః) కృష్ణపక్షాభిమాని దేవత, (షణ్మాసాః దక్షిణాయనం) ఆరుమాసముల దక్షిణాయనమునకు అభిమాని దేవత-వీరుండునట్టి ఆమార్గముగుండ వెళ్ళినవాడై (చాంద్రమసం) చంద్రసంబంధమైన (జ్యోతిః) తేజస్సును, (ప్రాప్య) పొంది, (నివర్తతే) ఈలోకమునకు తిరిగివచ్చును.

ధ్యానయోగులు, కర్మయోగులు-అను రెండువిధములైన యోగులు ప్రయాణముచేయు ఈరెండు మార్గముల లోను ఉన్న దేవతలు ఆజీవులను పైకి పంపుటయను సహాయముచేయునవి యగుటచే ఆ దేవతలకు ఆతివాహిక దేవతలని పేరు. అందు ముగ్గురుదేవతలు కాలాభిమాని దేవతలు, ఇద్దరు ఇతరులు అగుటచేత, మామిడిచెట్లు హెచ్చుగాను ఇతర వృక్షములు తక్కువగాను ఉన్నతోటకు ఆమ్రవనమనియే పేరుకలుగునట్లు భగవానుడు "ఈఉభయవిధ యోగులును ప్రయాణించు కాలమును (కాలాభిమాని దేవతామార్గమును) నీకు చెప్పెద" నని ముందుపలికి యీ మార్గములను వివరించినాడు. ఈమార్గములలో మొదటిదానికి ఉత్తరాయణమార్గమనియు, రెండవదానికి దక్షిణాయన మార్గమనియు పేరు. ఉత్తరాయణమార్గమునకే అర్చిరాది మార్గమనియు, దేవయానమనియు నామాంతరములు కలవు. దక్షిణాయన మార్గమునకు ధూమాది మార్గమనియు, పితృయాణ మనియు వ్యవహారము కలదు.

—:o:—

# నవమాధ్యాయము

## రాజవిద్యా రాజగుహ్యయోగము

[గడచిన అధ్యాయములలో పలుతావులలో, పలుతెరగుల చెప్పబడినట్టియు రాబోవు అధ్యాయములలో చెప్పబడనున్నట్టియు బ్రహ్మజ్ఞానముయొక్క సార మీ యధ్యాయములో ప్రతిపాదింపబడినది. కావున నీ యధ్యాయమునకు "రాజవిద్యా రాజగుహ్య" మను పేరువచ్చినది. విద్యలలో కెల్ల రాజైనది రాజవిద్య. రహస్యములలోనెల్ల రహస్య రాజగుహ్యమును కూడనని దీని యర్థము.]

ఓ పార్థా! అవ్యక్తస్వరూపముగల నేను ఈజగమంతయు వ్యాపించియున్నాను. సర్వభూతములు నాయందే యున్నవి. కాని నేను వానియందు లేను. (అనగా:వానిలోనే యిమిడిలేను. అంతకు హెచ్చుగా వ్యాపించియున్నాను.) నేను భూతములను సృజించుచు భరించుచున్నాను. ఆకాశమందు వాయువు అంతటను సంచరించుచున్నది. అయినను ఆకాశములేనిచోటులేదు. అనగా: ఆకాశమును త్రోసివైచి అదిలేనిచోట వాయువు సంచరించుటలేదు. ఆకాశము వ్యాపించియుండగనే దానిచే స్పృశింపబడనిదై దానిని స్పృశింపజాలనిదై వాయువు సంచరించుచున్నది. అట్లే

సమస్తభూతములు పరమేశ్వరునిలో నున్నను పరమేశ్వరుని సర్వవ్యాపకత్వమునకు భంగములేదు. దేనిచేతను స్పృశింప బడక అంతటను నుండు ఆకాశముకూడ పరమేశ్వరునిలో నున్నదై యాతని స్పృశింపలేకపోవుచున్నది."

ఓ కౌన్తేయ! కల్పాదియందు నేను భూతములను సృజింతును; కల్పాంతమందు ప్రళయము గావింతును. ఈ విధముగా నా ప్రకృతియు, అవిద్యాత్మకమును సత్వరజస్తమో గుణమయమును అగు మాయ ననుసరించి సర్వజాతములు నుత్పత్తి నాశములను పొందుచున్నవి 8. నేనుమాత్ర ముదాసీనుడనుగానే యుందును. 9. నేను సాక్షీమాత్రుడనై నిష్క్రియుడనుగా నుండగానే నామాయ చరాచరజగత్తును సృజించుచున్నది. 10 నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుడనైనను మనుష్యదేహము నాశ్రయించి యవతారముగా వచ్చిననన్ను యథార్థముగా గుర్తింపలేక మూఢు లవమానపరచు చున్నారు 11. మహాత్ములు నన్ను సేవించుచునే యున్నారు 13. ఎట్లనః

సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః
సమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. 14

(భక్త్యా) భక్తిచేత (నిత్యయుక్తాః) నిరంతరము ఏకాగ్రత కల్గినవారు, (సతతం) ఎల్లప్పుడు, (మాం) నన్ను, (కీర్తయన్తః) కీర్తించుచున్నవారై, (యతంతశ్చ) ఇంద్రియ

నిగ్రహాదులచేత ప్రయత్నించుచున్నవారై (దృఢవ్రతాః) దృఢమైన వ్రతముగలవారై, (నమస్యంతశ్చ) నమస్కరించుచున్నవారై, (మాం) నన్ను, (ఉపాసతే) సేవించుచున్నారు.

కోర్కెలతో నన్ను సేవించువారు యజ్ఞాదులనుచేసి స్వర్గాదులను పొంది చేసిన పుణ్యము అనుభవింతురు. తమ పుణ్యము ఇంచుమించుగా అనుభవింపబడిపోయిన కాలమున వారు మర్త్యలోకమునకు తిరిగివత్తురు.

క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి. 21

ఏ కోరికలును లేక నన్నే యెవరు సేవింతురో వారికి కావలసిన దంతయు నేనే సమకూర్తును.

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమంవహామ్యహమ్.

(యే) ఏ, (జనాః) జనులు (అనన్యాః) ఇతరభావము లేనివారై, (మాం) నారాయణుడనైననన్ను, (చింతయంతః) చింతించుచున్నవారై (పర్యుపాసతే) ఉపాసించుచున్నారో, (నిత్యాభియుక్తానాం) ఎల్లప్పుడు నాయందే దృష్టిగల (తేషాం) వారియొక్క, (యోగక్షేమం) యోగమును, క్షేమమును,-(రావలసినదానిని రప్పించుటను - నిలబెట్టవలసిన దానిని నిలబెట్టుటను)-(అహం) నేను (వహామి) వహించుచున్నాను.

సకాములై యజ్ఞాదులను చేయువారు బహుధనమును వెచ్చింపవలసియుండును; కాని నిష్కాములై మోక్షము కొరకు నన్నుపాసించువారు ఏమి యర్పించినను నేను గ్రహింతును.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః. 26

(యః) ఎవడు, (మే) నాకు (భక్త్యా) భక్తిచేత, (పత్రం) పత్రమును, (పుష్పం) పుష్పమును, (ఫలం) ఫలమును, (తోయం) ఉదకమును, (ప్రయచ్ఛతి) ఇచ్చుచున్నాడో? (ప్రయతాత్మనః) శుద్ధమైన అంతఃకరణముగల యాభక్తునియొక్క, (భక్త్యుపహృతం) భక్తితో అర్పింపబడిన (తత్) ఆవస్తువును, (అహం) నేను, (అశ్నామి) గ్రహించుచున్నాను.

కావున

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణమ్. 27

ఓ కౌంతేయ, నీవు (యత్) దేనిని, (కరోషి) చేయుచున్నావో,(యత్) దేనిని (అశ్నాసి) తినుచున్నావో (యత్) దేనిని (జుహోషి) హోమము చేయుచున్నావో, (యత్) దేనిని (తపస్యసి) తపస్సుచేయుచున్నావో? (తత్) దానిని

(మదర్పణం) నాకర్పింపబడినదానినిగా (కురుష్వ) చేయుము. అనగా సమస్తకర్మలను ఈశ్వరార్పణబుద్ధితో ఈశ్వరాను గ్రహమునకై చేయవలయును.)

నాయందలి భక్తియొక్క మాహాత్మ్య మెట్టిదనిన,

అపిచే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవ సమన్తవ్య స్సమ్య గ్వ్యవసితోఽపి సః.

(యః) ఎవడు, (సుదురాచారోఽపి) మిక్కిలి చెడ్డదైన ప్రవర్తనము గలవాడైనను, (అనన్యభాక్) ఇతరులను సేవింపనివాడై, (మాం) నన్ను, (భజతే) సేవించునో (సః) వాడు (సాధురేవ) మంచివాడుగానే (మంతవ్యః) తలపదగిన వాడు, (హి) యెందువలననగా (సః) వాడు (సమ్యక్) చక్కగా (వ్యవసితః) నిశ్చయబుద్ధి గలవాడాయెను.

[ఎన్ని దుష్టకార్యములు చేసినవాడైనను భక్తుడైన చాలును; వాడు యోగ్యుడేయని దీని యర్థముకాదు. దుర్మార్గుడైనను నన్ను సేవించుటకు ప్రారంభించుచో నా ప్రభావమువలన వాని దుర్మార్గబుద్ధి క్షీణించి వాడు సన్మార్గము లోనికి మారునని దీని యర్థము. "క్షిప్రం భవతి ధర్మాత్మా" అని దీనితర్వాతి శ్లోకములో స్పష్టముచేయబడినది]

కావున నో పార్థా,

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః 34

(మన్మనాః) నాయందు మనస్సుగలవాడవు అగుము, (మద్భక్తః) నాయందు భక్తుడవు అగుము. (మద్యాజీ) నన్ను పూజించువాడవు అగుము. (మాం) నన్ను (నమస్కురు) నమస్కరించుము, (ఏవం) ఈ ప్రకారముగా, (ఆత్మానం) చిత్తమును, (యుక్త్వా) ఏకాగ్రముచేసి, (మత్పరాయణః) నేనే ఉత్తమగతిగా గలవాడవై, (మామేవ) నన్నే, (ఏష్యసి) పొందగలవు.

[ఈశ్లోకముయొక్క పూర్వార్థములో చెప్పబడిన నమస్కరించుట, పూజించుట, భక్తుడై యుండుట అను నాల్గును ఒకదానికంటె ఒకటి ఉత్తమమైనవిగా నున్నవి. ముందుగా నే దేవాలయమునకో వెళ్ళి నమస్కారమాత్రమైనను చేయువాడైనను, క్రమముగా భగవంతుని పూజించు సంకల్పము గలవాడగును. కొంతకాలము పూజచేయుగా భక్తికల్గును. భక్తి పెరుగుచో భగవత్తన్మయత్వము కల్గును.]

—:O:—

# దశమాధ్యాయము

## విభూతియోగము

[సప్తమాధ్యాయములో పరమేశ్వరుడు జగత్తంతను నెట్లు వ్యాపించియున్నదియు జగదాధార మెట్లయినదియు చెప్పబడినది. మఱియు నాపరమేశ్వరు నెట్లు చింతింపవలసినదియు నిరూపింపబడినది. ఇంద్రియములకు వ్యక్తముకాక సర్వజగదంతర్యామియైన అక్షర బ్రహ్మముయొక్క యీ యుపాసనమే కాక వ్యక్తజగత్తునుకూడ పరమేశ్వరాభిన్నముగ చింతించుటకు పూర్వరంగముగ విభూతిమద్వస్తూపాసన మీయధ్యాయములో చెప్పబడినది.

ఓ మహాబాహూ, నావాక్కులను నీవు ప్రీతితో వినుచున్నావు. కావున నీహితమునుగోరి నీకింకను చెప్పుచున్నాను. వినుము! దేవతలకుకూడ నాపుట్టుక తెలియదు. నేనే సమస్తమునకు కారణభూతుడను. ప్రాణులకుగల్గు సుఖము, దుఃఖము, భయము, యశస్సు, అపయశస్సు - ఈభావములన్నియు నావలననే కల్గుచున్నవి. 4

సమస్తచరాచరప్రజల సృష్టికిని కారణభూతులైన సర్వప్రాచీనులగు వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు అనిరుద్ధుడు అను నల్గురును, వారితరువాతివారైన సప్తమహర్షులును, సప్తమనువులును నావలననే వచ్చిరి.

ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః. 7

(యః) ఎవడు, (మమ) నాయొక్క, (ఏతాం) ఇంత వరకు చెప్పబడిన, (విభూతిం) విస్తారమును, (యోగంచ)అవ్యక్తుడనైయుండియు వ్యక్తుడనగుటకై నాకుగల నేర్పరితనమును, (తత్త్వతః) యథార్థముగా, (వేత్తి) తెలిసికొనుచున్నాడో, (సః) వాడు, (అవికంపేన) చలనములేని, (యోగేన) సమ్యగ్దర్శనముతో, (యుజ్యతే) కూడుకొనును, (అత్ర) ఈవిషయమై, (సంశయః) సంశయము (న) లేదు.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే. 10

(సతతయుక్తానాం) నిరంతరము నాయందేకాగ్రతకలవారై (ప్రీతిపూర్వకం) స్నేహపూర్వకముగా, (భజతాం) నన్ను సేవించువారికి, (తం) ఆ (బుద్ధియోగం) నిర్మలమైన బుద్ధితో కలసియుండుటను, (దదామి) ఇచ్చుచున్నాను. (యేన) ఆ బుద్ధియోగముచేత, (తే) వారు (మాం) నన్ను, (ఉపయాంతి) పొందుదురు.

అట్టివారు నాయందే చిత్తముగలవారై, నాయందే ప్రాణముగలవారై, ఒకరికొకరు నన్నుగూర్చి బోధించుకొనువారై, చెప్పుకొనువారై యెల్లప్పుడు నన్ను సంతోషపెట్టుచు, వారు సంతోషపడుచుందురు. 9

[అంత అర్జునునకు పరమేశ్వర విభూతుల నింకను తెలిసికొనవలయునను కౌతుకముకలుగును. "ఓపురుషోత్తమా! ఏవిభూతులచేత నీ వీలోకములను వ్యాపించియున్నావో యా విభూతులను పూర్తిగా చెప్పుము, ఓభగవానుడా, ఏ యే వస్తువులయందు నేను నిన్ను ధ్యానింపగలవాడనో తెలుపుము" అని యడుగును. పరమేశ్వరుడిట్లు వివరించును.]

ఓ కురుశ్రేష్ఠా! నాదివ్యవిభూతులు అనంతములైనవి; అందులో ముఖ్యమైనవి నే చెప్పుచున్నాను. ఈ క్రిందిరీతిగా నీవు నన్ను ధ్యానింపవచ్చును. 19

ద్వాదశాదిత్యులలోను విష్ణువను ఆదిత్యుడను నేను; ప్రకాశింపచేయువానిలో సూర్యుడను నేను; మరుద్దేవతలలో మరీచియనువాడను నేను 20; నక్షత్రములలో చంద్రుడను నేను; వేదములలో సామవేదము నేను; దేవతలలో ఇంద్రుడను నేను; ఇంద్రియములలో మనస్సు నేను. 22

[పరమేశ్వరవిభూతి ప్రతివస్తువులో నున్నను ఏ యే విభూతులు హృదయంగమముగా నుండునో, ఏయే విభూతుల యందుపాసకుడు మనస్సును లగ్నముచేయగలడో అవి మాత్రమే కొన్ని చెప్పబడుచున్నవని గుర్తింపవలయును. పైని అర్జును డడిగినదికూడ నీదృష్టితోనే కదా! ఇట చెప్పబడిన యొక్కొక్క వస్తువు ఆ యా వర్గములలో శ్రేష్ఠమైన దనుట స్పష్టము.]

రుద్రులలో శంకరుడను నేను; యక్షరక్షస్సులలో కుబేరుడను నేను. అష్టవసువులలో అగ్నిని నేను; సరస్సులలో సాగరమును నేను;24 మహర్షులలో భృగువును నేను; వాక్కులలో ఓంకారము నేను; యజ్ఞములలో జపయజ్ఞము నేను; స్థావరములలో హిమాలయపర్వతము నేను, 25

మహర్షీణాం భృగు రహం గిరా మస్మ్యేక మక్షరం
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః.25

అన్ని వృక్షములలోను అశ్వత్థవృక్షమును నేను; దేవర్షుల్లలో నారదుడను నేను; గంధర్వులలో చిత్రరథుడను నేను సిద్ధులలో కపిలమహర్షిని నేను; అశ్వములలో అమృతనిమిత్త సముద్రమథన సంభవమైన ఉచ్చైశ్శ్రవస్సును నేను; గజేంద్రములలో ఐరావతమను నేను; నరులలో ప్రజారక్షకుడైన రాజును నేను; 20 ఆయుధములలో వజ్రాయుధమను నేను; ఆవులలో కామధేనువును నేను; సృష్టిచేయించు మన్మథుడను నేను; సర్పములలో వాసుకిని నేను; 28 నాగులలో అనంతుడను వాడను నేను; జలదేవతలలో వరుణుడను నేను; పితృదేవతలలో అర్యముడను పితృరాజును నేను; నిగ్రహించు వారిలో యముడను నేను; 29 దైత్యులలో ప్రహ్లాదుడను నేను; ప్రేరణచేయువారిలో కాలమును నేను; మృగములలో సింహమును నేను; పక్షులలో గరుత్మంతుడను నేను; 30 వీచువారిలో వాయువును నేను; శస్త్రములను ధరించు

వారిలో దశరథపుత్రుడైన రాముడను నేను; జల జంతువు
లలో మొసలిని నేను; నదులలో గంగను నేను. 31

ఓ అర్జునా! అన్ని సృష్టులకు ఆది, మధ్యము అంతము కూడ నేనే; విద్యలలో అధ్యాత్మవిద్యను నేను; ఖాదజల్ప వితండాదులలో అర్థ నిర్ణయ హేతువైన వాద మనునది నేను; 32 అక్షరములలో అకారమును నేను; సమాసములలో (ఉభయపద ప్రధానమైన) ద్వంద్వసమాసమును నేను; (మఱి యే సమాసములోను ఉభయపద ప్రాధాన్యము లేకపోవుటచే ద్వంద్వమునకు విశిష్టత) నాశము లేని కాలమును నేనే; ఎల్ల రకు కర్మఫల ప్రదాత నగు చతుర్ముఖబ్రహ్మను నేనే. 33

సర్వమునుహరించు మృత్యువును నేనే; అభ్యుదయము పొందనున్న వాని అభ్యుదయమును నేనే; స్త్రీలలో కీర్తి, (శ్రీ), వాక్కు, స్మృతి, మేధ, ధృతి, క్షమ—ఇవి నేను (కీర్త్యాదులు స్త్రీలుగా నూహింపబడినవి. వాని క్షణిక సంబం ధమునైనను పురుషులు కామించుచుండుటచే నిట్లు చెప్ప బడినవి) 34; సామ వేద మంత్రములలో బృహత్సామమనునది నేను; వైదిక ఛందస్సులలో గాయత్రిని నేను; మాసములలో మార్గశీర్ష మును నేను; ఋతువులలో వసంత ర్తువును నేను 35; కపటముచేయువానిలో జూదమును నేను; తేజస్సులోని తేజస్సు నేను; జయించువారిలోని జయమును నేను; కృషి చేయువారిలోనికృషి నేను;సాత్వికులలోని సత్త్వగుణము నేను.

యాదవులలో వాసుదేవుడను నేను; పాండవులలో ధనంజయుడను నేను; మునులలో వ్యాసుడను నేను. కవులలో శుక్రడను నేను; 37 శిక్షించువారిలో యముడను నేను; జయింపగోరువారిలో నీతిని నేను; గోప్యవిషయములలో మౌనము నేను; జ్ఞానముగలవారిలో జ్ఞానము నేను. 38

ఓ అర్జునా, సర్వభూతములకు నేదిబీజమో అది నేనే. నేను లేకుండ చరాచరవస్తు వేదియు లేదు. 38

యద్య ద్విభూతిమ త్సత్వం శ్రీమదూర్జిత మేవ వా
త త్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవం. 14

(యద్యత్) ఏయే, (సత్వం) వస్తువు, (విభూతిమత్) అతిశయము గల్గినదో, (శ్రీమత్) శోభతోకూడుకొని యున్నదో, (ఊర్జితమేవవా) గొప్పదైనదో, (త త్తత్) ఆయా వస్తువును, (త్వం) నీవు, (మమ) నాయొక్క, తేజోంశసంభవమేవ) తేజస్సుయొక్క అంశవలన పుట్టినదిగానే, (అవగచ్ఛ) తెలిసికొనుము.

ఓ అర్జునా! నీకు నే నెంతని చెప్పుదును?

విష్టభ్యాహ మిదంకృత్స్న మేకాంశేన స్థితో జగత్. 42

(అహం) నేను, (ఏకాంశేన) ఒకఅంశముచేత, (ఇదం) ఈ, (కృత్స్నం) సమస్తమైన, (జగత్) జగత్తును, (విష్టభ్య) ఆక్రమించి, (స్థితః) ఉన్నాను.

[మచ్చునకు ప్రతి వర్గములోను ఉత్కృష్టమైనది పరమేశ్వరు డని ఉపాసకుల నిమిత్తము చెప్పబడినను, పరమేశ్వరుడులేని దీజగత్తులో నేదియు లేదని తెలిసికొనవలయును. అంతియేకాదు, ఈ వ్యక్త జగత్తులోనే పరమేశ్వరుడుపరిమితుడై లేడు. ఈ వ్యక్తజగత్తునుదాటి యా పరమేశ్వరుని అవ్యక్తస్వరూపము అనంతముగా వ్యాపించియున్నదనియు నీవ్యక్తజగత్తు అఖండ పరమేశ్వరునిలో నొక యంశము మాత్రమే యనియు తెలిసికొనవలయును.]

—(•••)—

# ఏకాదశాధ్యాయము

## విశ్వరూపసందర్శనయోగము

[రమ్యమైన వస్తువులలోను గుణములలోను ఈశ్వర తత్త్వమును దర్శించి యానందించుట భక్తులకు సులభము. ఈ యుపాసనము సాగుచున్న కొలదియు రమ్యముగా కనపట్టని వస్తువులలోకూడ పరమేశ్వరలీల గోచరించును. పూర్ణిమా చంద్రచంద్రికలచే ధగధగాయమానమై యుప్పొంగు సముద్ర తరంగములలోను, సాయంతన సూర్యారుణకిరణ రంజితము లైన సుందరోద్యానమహీరుహ శాఖలలోను పరమేశ్వరుని గుర్తించిన భక్తులు చాలమంది యుండవచ్చును. సామాన్యు లకు రోతగల్గించు క్షుద్రజంతువులలోకూడ నట్టి యీశ్వర లీలనే చూడగల్గిన పరిణతభక్తికలవారరుదు. కాని యదియే యెల్లరకు లక్ష్యమని గుర్తించుకొనవలయును. కనుకనే వేదములో నమకమను భాగములో నొకప్రకరణము దేవత లకు నమస్కారముతో ప్రారంభమై, మహానుభావులకు నమ స్కారములోనికి దిగి కుక్కలకు నమస్కార మనుదానిలోనికి పరిణమించినది. మనలను రక్షించి, మనకు శుభములను కూర్చు స్వరూపములో పరమేశ్వరుని సులభముగనే భావింప వచ్చును; కాని భీష్మాచార్యునివలె తన్ను సంహరించుటకై చక్రమునెత్తి మీదికి లంఘించు పరమేశ్వరరూపమునకు

స్వాగతమిడగలవా రరుదుగనే యుందురు. జగత్తంతయు పర మేశ్వరాంతర్గతమే యని యనుభవములో గుర్తెరిగినవాడే యట్లు భావింపగలడు. కుండలలోనుండి మట్టిని తీసివేయుచో కుండలకెట్లు ఉనికియే పోవునో అట్లే యీనామరూపాత్మక మైన జగత్తులోనుండి పరమేశ్వరుని వేఱుపరచుచో జగత్తే యుండదు. కావున సత్యమైనది పరమేశ్వరపదార్థమే కాని జగత్తుకాదు. విశ్వములోనున్న రూపము లన్నియు నా పర మేశ్వరునిలో నంతర్భూతములేకాని వేరు కావని యిదివరలో పరమేశ్వరుని వలన విన్నదానినే ప్రత్యక్షముగా చూడవల యునను కోరికగల్గి విశ్వరూపమును చూపవలసినదిగ నర్జునుడు పరమేశ్వరుని కోరును. భక్తవత్సలుడైన పరమే శ్వరుడు అర్జునునకు దివ్యదృష్టి నిచ్చి యాతనికి తన విశ్వ రూపము చూపును. సప్తమాష్టమాధ్యాయములలో అవ్యక్తో పాసనము చెప్పబడినట్లే యీ యధ్యాయములలో వ్యక్తో పాసనము చెప్పబడుచున్నది. ఇది కొలదిగా తొమ్మిదవ యధ్యాయములో స్పృశింపబడినది.]

అనేక బాహువులు, అనేకోదరములు, అనేక నేత్ర ములు గల్గి, విశ్వతోముఖమై దివ్యమాల్యాంబరధరమై, సహస్రసూర్యసమప్రభమై విరాజిల్లు విశ్వరూపము నర్జునుడు దర్శించెను. 10–12 దేవపితృ మనుష్యాది భేదములతో నొప్పు జగత్తు ఒక్కచోటనున్నదై కన్పట్టెను. బ్రహ్మ విష్ణు మహేశ్వ రులును ఆ దేహములోనే యుండిరి. 15 ఆరూపమును స్తుతిం చుచు నర్జును డిట్లు పలికెను.

"ద్యావాపృథివ్యో రిద మంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః
దృష్ట్వాద్భుతం రూప మిదం తవోగ్రం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్. 20

ఓ మహాత్మా, (త్వయా ఏకేన) నీ యొక్కనిచేతను, (ద్యావాపృథివ్యోః) పృథివ్యాకాశములయొక్క (ఇదం) ఈ (అంతరం) మధ్యభాగము (వ్యాప్తంహి) వ్యాపింపబడినది కదా! (సర్వాః) సమస్తములైన (దిశశ్చ) దిక్కులునువ్యాపింప బడినవికదా! (తవ) నీయొక్క (అద్భుతం) ఆశ్చర్యకరమై నట్టియు(ఉగ్రం) భయంకరమైనట్టియు, (ఇదం) ఈ, (రూపం) రూపమును, (దృష్ట్వా) చూచి, (లోకత్రయం) జగత్త్రి యము, (ప్రవ్యథితం) భయపడినది.

"కొందరు దేవతలు నీలో ప్రవేశించుచున్నారు; కొందరు నిన్ను స్తుతించుచున్నారు. మహర్షులు, సిద్ధులు నీకు మంగళములు పల్కుచున్నారు. 21 రుద్రులు, ఆదిత్యులు, గంధర్వులు మున్నగువారు ఆశ్చర్యముతో నిన్ను చూచు చున్నారు. నీ కోరలు భయంకరముగానున్నవి. నాకు దిక్కు తెలియుటలేదు. ధార్తరాష్ట్రులు భీష్మద్రోణాదులు భయంకరమైన నీ నోటిలో ప్రవేశించుచున్నారు. కొందరు దంతములలో చిక్కుకొనుచున్నారు. మిడత లగ్నిపై ప్రాలు నట్లు, ప్రాణులు నాశనమునకై వేగముగా నిన్ను ప్రవేశించు

చున్నారు, ఇంతకు పూర్వము నీమహిమను నే నెఱుగనైతిని: ఇప్పటికిని సర్వాద్యుడవైన నిన్ను తెలిసికొనవలసియే యున్నాను.

"నీవు స్నేహితుడవు మాత్రమేయని తలచి ఓకృష్ణా! యాదవా! అని నిన్ను పిలిచితిని. ఆహార శయ్యాసన భోజనములయందు నిన్ను పరిహసించితిని. ఓ ప్రభూ! తెలియక అట్లు చేసినందులకు నన్ను క్షమింపుము.

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హేకృష్ణ! హేయాదవ! హేసఖేతి
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదా త్ప్రణయేన వాపి. 41
యచ్చావహాసార్థ మసత్కృతోఽసి
విహారశయ్యాసన భోజనేషు
ఏకోథ వాప్యచ్యుత తత్సమక్షం
తత్క్షామయే త్వా మహ మప్రమేయం. 42

"ఓ దేవా! ఈ రూపమును నేనిక చూడలేను నా కిదివఱ కభ్యస్తమైన నీ ప్రసన్న రూపమునే తిరిగిచూపుము."

పరమేశ్వరు డర్జునునితో "ఓ అర్జునా చూచితివా; దుర్యోధనాదులెల్లరు నాలో చచ్చియేయున్నారు. నీవు నిమిత్తమాత్రముగానుండి వారిని సంహరింపుము." 33 అని తనసంకల్పానుసారమే దుర్యోధనాదులు నశింపనుండగా స్వధర్మమునుండి జంకవలసిన పనిలేదని 'నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్' అని యర్జునుని హెచ్చరించును.

అర్జునుని ప్రార్థనము ననుసరించి పరమేశ్వరుడు విశ్వరూపము నుపసంహరించి తిరిగి యర్జునునకు తన కృష్ణరూపమునే చూపి యిట్లనెను:—

ఓ అర్జునా ! తపోదానాది సాధనములచేకూడ నెవడును నా యీ విశ్వరూపము చూడలేడు. ३५ అనన్యభక్తితో నన్ను సేవించువారే చూడగల్గుదురు.

భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున !

ఓ అర్జునా (అనన్యయా) మరి యేయితర వస్తువునందును లేని పూర్ణమైన; (భక్త్యా) భక్తిచేత; (ఏవంవిధః అహం) ఈ విశ్వరూపము ధరించిన నేను; (శక్యః) లభ్యుడను.

మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః
నిర్వైర స్సర్వభూతేషు యస్స మా మేతి పాండవ! 55

ఓ పాండవా; (యః) ఎవడు; (మత్కర్మకృత్) నా నిమిత్తమై కర్మలు చేయునో; (మత్పరమః) నేనే పరమగమ్యముగా గలవాడో (మద్భక్తః) నాయందు భక్తిగలవాడో; (సంగవర్జితః)ధనపుత్రమిత్ర కళత్రాదులయందు ప్రీతిలేనివాడో; (సర్వభూతేషు) సర్వభూతములయందు; (నిర్వైరః) శత్రుభావము లేనివాడో (సః) వాడు; (మాం) నన్ను; (ఏతి) పొందును.

[దారపుత్రాదులయందు ప్రేమలేకుండ కాఠిన్యముతో నుండవలయునని యిచట భగవంతు డెవరికిని ఉపదేశించుట లేదని గుర్తింపవలయును. ఈశ్వరునియందు పూర్ణమైన భక్తి కలవాడు దారపుత్రాదులవలన సుఖమునం దాసక్తి చెందడనియే దీని యర్థము. అట్లే సర్వప్రాణులయందును నిర్వైర భావముతో నుండవలయుననునప్పుడు విశ్వరూపములో గన్పట్టినట్లు సర్వము పరమేశ్వరుని స్వరూపమే యని యెంచి, ఎవరి పట్లను ద్వేషములేకుండ ప్రవర్తింపవలయుననియు, దుష్టులను శిక్షింపవలసివచ్చినను శత్రుభావముతో నా పని చేయ రాదనియు తెలిసికొనవలయును.]



# ద్వాదశాధ్యాయము

—...—

## భక్తి యోగము

[ద్వితీయాధ్యాయము మొదలు దశమాధ్యాయాంతము వఱకును ఉపాధిరహితమైన అవ్యక్త బ్రహ్మముయొక్క ఉపాసనము చెప్పబడినది, అది సప్తమాధ్యాయమునుండి విపులముగా తెలుపబడినది. ఏకాదశాధ్యాయములో వ్యక్తమైన విశ్వరూపముయొక్క యుపాసనము తెలుపబడినది. ఇచట ఉపాసనశబ్దార్థమును చెప్పవలసి యున్నది. వస్తువును గోచరింప చేసికొనుటకై దానిసమీపమున కూర్చుండి దానిపై తైలధారవలె ఎడతెగకుండు బుద్ధిని ప్రసరింప చేయుటయే ఉపాసన మనబడును. ఉదకధారలో నడుమ విచ్ఛిత్తి యుండును కాని తైలధారలో అవిచ్ఛిన్నత యుండును. ఈరెండు విధములైన ఉపాసనములో నేది గొప్పదని యర్జునుడు ప్రశ్నించును. పరమేశ్వరు డిట్లుత్తర మిచ్చును.

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః. 2

(నిత్యయుక్తాః) ఎడతెగకుండునట్లు చిత్తైకాగ్రత కలవారై (పరయా) గొప్పదైన, (శ్రద్ధయా) శ్రద్ధతో, (ఉపేతాః) కూడుకొన్నవారై, (మయి) విశ్వరూపుడైన

నాయందు, (మనః) మనస్సును, (ఆవేశ్య) ఉంచి, (యే) ఎవరు, (పర్యుపాసతే) నన్నుపాసించుచున్నారో, (తే) వారు, (యుక్తతమాః) గొప్పయోగులుగా, (మే) నాకు, (మతాః) సమ్మతులు.

అవ్యక్తోపాసన చేయువారి విషయ మేమనః

యేత్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచింత్యంచ కూటస్థ మచలం ధ్రువం. 3

సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తేప్రాప్నువంతి మామేవ సర్వభూతహితేర తాః. 4

(యే)ఎవరు,(సర్వత్ర)అంతటను,(సమబుద్ధయః)సమబుద్ధి గలవారై-ఒకేబుద్ధిగలవారై-ఇష్టానిష్టములయందు వికారము పొందనివారై - (సర్వభూతహితేరతాః) సర్వప్రాణులమేలు నందు ఆసక్తికలవారై, (అక్షరం) నాశరహితమై, జీవభూత మైనట్టియు, (అనిర్దేశ్యం) నిర్దేశించుటకు వీలులేనట్టియు, (అవ్యక్తం) వ్యక్తముకానట్టియు — ఇంద్రియగోచరము కానట్టియు, (సర్వత్రగం) అంతటను వ్యాపించియున్నట్టియు, (అచింత్యం) మనస్సుచే నాలోచించుటకు వీలుకానట్టియు (కూటస్థం) రాశివలెనుండునట్టియు, (అచలం) చలింపనట్టియు, (ధ్రువం) నిత్యమైనట్టియు బ్రహ్మను, (పర్యుపాసతే) ఉపా సించుచున్నారో, (తే) వారు, (మామేవ) నన్నే (ప్రాప్ను వంతి) పొందుచున్నారు.

[వ్యక్తోపాసనము చేయువారు మంచి యోగులుగా (పరమేశ్వరుని యందు చిత్తసమాధానము గలవారుగా) మాత్రమే చెప్పబడినారు. అవ్యక్తోపాసనము చేయువారు పరమేశ్వరునే పొంది పరమేశ్వర స్వరూపులే యగుదురని చెప్పబడినది. కావున అవ్యక్తోపాసనము చేయువారికే గొప్ప ఫలము గల్గుననుట స్పష్టము] అట్టిచో హెచ్చుమంది వ్యక్తోపాసనమునే యేల చేయుదురనః అవ్యక్తోపాసనము కష్టమని భగవానుడు చెప్పుచున్నాడు. 5

[పై మూడవ శ్లోకములో కూటస్థ శబ్దముగలదు. జగత్తంతయు మారినను 'మారకుండు' అక్షరబ్రహ్మమునకే, జీవభూతమైనదానికే, కూటస్థమని పేరు. దీని వ్యుత్పత్తినీ క్రిందివిధముల పెద్దలు చెప్పియున్నారు: (1) కూటమనగా రాశి. ఏదైనను ముక్కగానున్నది. చలించనుగాని రాశిగా నుండునది తలింపదు. ఈబ్రహ్మము కూటమువలె నుండునది. (2) కూటమనగా: పైకి నిర్దోషముగా కనబట్టి దోషమునకు కారణభూతమైనది.కూటసాక్ష్యమను శబ్దములో నీయర్థము కలదు. అక్షరబ్రహ్మముయొక్క మాయోపాధి యీ లోకములో సంతతను వికారాది దోషములను గల్గించుచుండుటచే నా మాయోపాధి నధిష్ఠించిన అక్షరబ్రహ్మను కూటస్థమనవచ్చును. (3) కూటమనగా ఇనుపవస్తువులు, బంగారపువస్తువులు చేయునపుడు పనివాడు అడుగున అధారము

నకై పెట్టుకొనుదాగలి. దానిపై ఆధారపడిన వస్తువెంతగా మారినను ఆ దాగలి మాత్రము నిర్వికారముగా నుండును. కావున నశ్వరప్రకృతికి ఆధారమైన అక్షరబ్రహ్మము కూటస్థ మని చెప్పబడును:)

కావునఓ అర్జునా, ప్రారంభమున విశ్వరూపోపాస నమునే చేయుము. పిమ్మట అవ్యక్తోపాసనమలవడును. ఆవిశ్వ రూపోపాసనము చేయుటకూడ శక్యముకానివారి కది యల వడుటకై యీక్రింది మార్గము సూచింపబడినది.9

అభ్యాసేఽ ప్యసమర్థో ఽసి మత్కర్మపరమో భవ
మదర్థమపి కర్మాణి కుర్వ న్సిద్ధి మవాప్స్యసి. 10

(అభ్యాసేపి)మాటిమాటికి వ్యక్తోపాసనము చేయుట యందుకూడ, (అసమర్థోపి) సమర్థుడవుకానిచో, (మత్కర్మ పరమః) నా నిమిత్తమై పనులు చేయువాడవు, (భవ) అగుము (మదర్థం) నా నిమిత్తమై, (కర్మాణి) కర్మలను, (కుర్వన్నసి) చేయుచున్నవాడవైనను, (సిద్ధిం) సిద్ధిని, (అవాప్స్యసి) పొంద గలవు.

అన్ని పనులను నా నిమిత్తమై చేయలేక పోయినను నీ వాచరించు సర్వకర్మల ఫలమును నాయందుంచుమని భగ వాను డాదేశించుచున్నాడు. అట్టివానికిని క్రమముగా ఉపా సనశక్తి యలవడును.

ఇట్లుపాసనాపరుడైనవాడు లోకములో నేరీతి నుండు నన :

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ. 13

(సర్వభూతానాం అద్వేష్టా) ఏప్రాణియందును ద్వేషములేనివాడై (మైత్రః) అన్ని ప్రాణులయందు స్నేహము గలవాడై (కరుణఏవచ) దయగలవాడుకూడనై, (నిర్మమః) మమకారములేనివాడై (నిరహంకారః) అహంకారములేనివాడై (సమదుఃఖసుఖః) సుఖదుఃఖములయందు సమభావము గలవాడై, (క్షమీ) ఓర్పుగలవాడై యుండును.

[భగవద్గీతలోని అన్నియోగములలోగూడ సర్వభూతదయ ప్రధానముగా చెప్పబడియున్నది.]

నాభక్తు లందరిలోను ఇతరవస్తువు లేమియు కోరక సమస్తశుభాశుభకర్మలను పరిత్యజించి ఏయాశయులేనివాడై ఎవరికిని భయమును కల్గింపనివాడై ఎవరివలనను భయపడని వాడై యుండువాడు నాకు ప్రియతముడు. 15.17

[ద్వితీయపంచమాధ్యాయములలో జ్ఞానివిషయములో చెప్పబడిన అంతఃకరణశుద్ధియే భక్తుని విషయములోకూడ చెప్పబడుట గమనింపదగినది.]

:o:

# త్రయోదశాధ్యాయము



## క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము

ఏడవ యధ్యాయములో పరమేశ్వరునియొక్క రెండు ప్రకృతులు చెప్పబడినవి. అందలి 'అపరా' ప్రకృతియే ఈ యధ్యాయములో క్షేత్రమని చెప్పబడినది. అచ్చటి పరా ప్రకృతియే ఇచ్చట క్షేత్రజ్ఞుడని చెప్పబడినది. ఈ రెండు ప్రకృతులను కలిగియున్న ఈశ్వరుని తత్త్వమును తెలియ జేయుటకై ఈ యధ్యాయము చెప్పబడుచున్నది.

ఈ యధ్యాయములో జీవేశ్వరులక భేదము ప్రతిపాదింప బడినది. సర్వశరీరములయందును క్షేత్రజ్ఞరూపముగా (జీవుని రూపముతో) ఉన్నవాడను నేనే యని యీ యధ్యాయము లోని రెండవశ్లోకములో భగవానుడు చెప్పుచున్నాడు.

భగవద్గీతలోని మొదటి ఆరధ్యాయములలోను జీవుని విషయము చెప్పబడినది. అనగా "త్వం" పదార్థమునుగురించి చెప్పబడినది. 7 వ అధ్యాయమునుండి 12 వ అధ్యాయము వఱకును ఈశ్వరుని గురించి (తత్పదార్థమును గురించి) చెప్ప బడినది. చివఱి ఆరధ్యాయములలోను ఆ రెండింటికిని అభేదము తెలుపబడినది. ఆ "పరమేశ్వరుడే నీవు" అని చెప్పబడుటచే "అసిపదార్థము" వివరింపబడినది. ఈరీతిగా "తత్త్వమసి"

అను ఉపనిషన్మహావాక్యము గీతలలో విస్తరింప బడినది. మొదటి ఆరధ్యాయములు మానవుని కర్తవ్యమును సూచించుటచే కర్మషట్కమనియు, తరువాతి ఆఱధ్యాయములు ఈశ్వరస్వరూపమును తెలుపుటచే భక్తిషట్కమనియు, చివరి ఆఱధ్యాయములు జీవేశ్వరాభేదమును ప్రతిపాదించుటచే జ్ఞానషట్కమనియు చెప్పబడుచున్నవి.

ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మిత్యభిధీయతే
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః. 1

హే కౌంతేయ! (ఇదం) ఈ, (శరీరం) శరీరము, (క్షేత్రమితి) క్షేత్రమని, (అభిధీయతే) చెప్పబడుచున్నది. (యః) ఎవడు, (ఏతత్) ఈక్షేత్రమును, (వేత్తి) తెలిసికొనుచున్నాడో, (తం) వానిని, (క్షేత్రజ్ఞ ఇతి) క్షేత్రజ్ఞుడని, (తద్విదః) - తెలిసినవారు, (ప్రాహుః) చెప్పుచున్నారు.

[ఈ శరీరమందుండి దీని విషయమైన జ్ఞానముగల్గి జీవభూతమై దీని ననుభవించువాడు క్షేత్రజ్ఞుడని చెప్పబడును.]

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత
క్షేత్రక్షేత్రజ్ఞయోర్ జ్ఞానంయత్తజ్ జ్ఞానంమతంమమ. 2

హేభారత! (మాం) నన్ను, (సర్వక్షేత్రేషు) సర్వశరీరములయందున్న, (క్షేత్రజ్ఞంచాపి) క్షేత్రజ్ఞునిగాగూడ, (విద్ధి) తెలిసికొనుము,—క్షేత్రము క్షేత్రజ్ఞుడుకూడ పరమే

శ్వరుని ప్రకృతులేయగుటచే ఈ రెండును నేనే యని పరమే శ్వరుడు చెప్పుచున్నాడు. కావుననే- (క్షేత్రక్షేత్రజ్ఞయోః) క్షేత్ర క్షేత్రజ్ఞులయొక్క, (యత్ జ్ఞానం) ఏజ్ఞానముకలదో (తత్) అది (మమ)నాజ్ఞానమని, (మతం) నాయభిప్రాయము.

[శరీరముయొక్క స్వరూపము ద్వితీయ సప్తమాధ్యాయములలో వివరింపబడియేయున్నది. ఇప్పుడు క్షేత్రక్షేత్రజ్ఞ జ్ఞానము కలిగించు సాధనములయొక్క గణము చెప్పబడుచున్నది.]

అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః　7

ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్.　8

అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు.　9

మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ
వివిక్త దేశసేవిత్వ మరతి ర్జనసంసది.　10

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్
ఏతజ్ జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానం య దతోఽన్యథా.　11

ఆత్మశ్లాఘ లేకుండుట, తన ధర్మాచరణమును ప్రకటించుకొనకుండుట, ప్రాణులను పీడింపకుండుట,

ఓర్పు, వక్రత్వము లేకుండుట, మోక్షసాధనము నుపదేశించు గురువులను సేవించుట, శరీరవాఙ్మనస్సులను శుచిగా నుంచుకొనుట, మోక్షసాధనములో చలింపకుండుట, ఇంద్రియ నిగ్రహము, విషయములయందు వైరాగ్యము, అహంకారము లేకుండుట, అజ్ఞానమువలన వచ్చునట్టియు, జ్ఞానము వలన నివారింపబడునట్టియు, సంసారమునందలి జన్మమృత్యు జరావ్యాధిదుఃఖములయందలి దోషమునుగురించి ఆలోచించు చుండుట, ఏవిషయమందును ఆసక్తి లేకుండుట, పుత్ర దారగృహాదులయందు సంసక్తిలేకుండుట, ఎల్లప్పుడు నిష్టానిష్టముల రెండింటియందును సమానమైన చిత్తము గలిగి యుండుట, అవిచ్ఛిన్నమైన సమాధిచేత ఏర్పడు నాయందు అచంచలమైన భక్తి, విజనప్రదేశములోనుండుట, జన సమూహములో నుండుటకు నిచ్ఛగింపకుండుట, జ్ఞానమందు స్థిరభావముండుట, మోక్షమునుగురించి యాలోచించుట- యివియన్నియు జ్ఞానమని చెప్పబడును. మిగిలినవన్నియు నజ్ఞానమే.

పై సాధనములచే తెలిసికొనవలసిన దేమన :

సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ. 14

(సర్వేంద్రియవివర్జితం) ఏ ఇంద్రియమును కలిగియుండనట్టియు (సర్వేంద్రియగుణాభాసం) సమస్తేంద్రియగుణములచే ప్రకాశించునట్టియు, (అసక్తం) దేనితోను కలియకుండ

గనే (సర్వభృచ్చైవ) సమస్తమును భరించునట్టియు, (నిర్గుణం) గుణములేనిదయ్యు, (గుణభోక్తృచ) గుణముల ననుభవించునట్టియు, సర్వాతీతమైన బ్రహ్మమును తెలిసికొన వలయును.

జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్యధిష్ఠితమ్. 17

(తత్) ఆ బ్రహ్మము, (జ్యోతిషామపి) ఆదిత్యాది జ్యోతిస్సులకును (జ్యోతిః) ప్రకాశకమైనది. (తమసః) అజ్ఞానమునకు, (పరం) పైనున్నది. (జ్ఞానం) జ్ఞానమునకు ఫలమైనది. (జ్ఞేయం) తెలిసికొనదగినది. (జ్ఞానగమ్యం) జ్ఞానముచేత తెలియదగినది. (సర్వస్య) సర్వప్రాణి సమూహము యొక్క (హృది) హృదయమునందు (ధిష్ఠితం) విశేషముగా నున్నది.

[ఆత్మయంతటను నున్నను బుద్ధియందే తెలిసికొన బడుచున్నది. శరీరాదుల నుత్పత్తిచేయునది ప్రకృతి. సుఖ దుఃఖముల ననుభవించుటలో కారణమైనవాడు పురుషుడు. పురుషుడు ప్రకృతియందున్నవాడై ప్రకృతిగుణములైన సత్త్వ రజస్తమోగుణములలో తగుల్కొనుచున్నాడు. 21 ఈవిధముగా సంసారము ననుభవించు అవ్యక్తపురుషునికంటె ఇంకను లోపల నిస్సంగుడై సుఖదుఃఖాతీతుడైన పురుషుడు -ఆత్మ-ఉన్నట్లు గుర్తించుటయే జ్ఞానపరమావధి.]

ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్పురుషః పరః. 22

(ఉపద్రష్టా) ప్రకృతిగుణములకు సమీపమందుండి చూచువాడును, (భర్తా) ప్రకృతిగుణములను భరించువాడును, (భోక్తా) వానిని అనుభవించువాడును, (అనుమంతా). ఆమోదించువాడును, అగు (పరః) మరియొక, (పురుషః) పురుషుడు, (అస్మిన్) ఈ (దేహే) దేహమందు గలడు. (మహేశ్వర ఇతి) మహేశ్వరుడనియు, (పరమాత్మేతిచ) పరమాత్ముడనియు, (ఉక్తః) ఆతడు చెప్పబడుచున్నాడు.

[ఈ శరీరములో చైతన్యముగలిగి సుఖదుఃఖముల ననుభవించుచున్న క్షేత్రజ్ఞుడను పురుషుడు ఈరీతిగా నా నిస్సంగుడైన పురుషుడను తానే అని తెలిసికొనుచో యాతడు మోక్షము పొందునని యర్థము. సర్వక్షేత్రములలోను క్షేత్రజ్ఞుడను నేనే యని పరమేశ్వరుడు చెప్పినట్లే అప్పుడాతడును నిస్సంగత్వానుభవము కలిగి, సర్వభూతాత్మభావము కలిగి ఈదేహములోనున్న తానే సార్వత్రికముగా నున్న బ్రహ్మమని గుర్తించును.]

—:o:—

# చతుర్ధశాధ్యాయము

## గుణత్రియవిభాగయోగము

క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క సంయోగమువలన జగదుత్పత్తి యగుచున్నదని వెనుకటి యధ్యాయములో చెప్పబడినది. పురుషునకు సంసారబంధము కలుగుటకు కారణము గుణములతోడి సంగమనికూడ చెప్పబడినది. ఆ గుణము లేవి? వాని స్వరూపమేమి? పురుషునకు వానితో సంగము ఎట్లుకల్గును?

[ప్రకృతియొక్క రెండుభాగములైన, పరాపరప్రకృతులని చెప్పదగిన, క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగమువలన జగదుత్పత్తి జరుగుచున్నదని చెప్పబడినంతమాత్రమున ప్రకృతియే స్వతంత్రముగా జగత్కారణమని తలంపరాదు. పరమేశ్వరుని సంకల్పానుసారముగానే ఈ క్షేత్రక్షేత్రజ్ఞసంయోగము జరుగుచుండుటవలన పరమేశ్వరునికే జగత్కర్తృత్వమని తెలిసికొనవలయును. అనగా ఉభయవిధప్రకృతి యను స్త్రీ జగదుత్పత్తిని చేయుటకై ఆమెయందు పరమేశ్వరుడు గర్భము నుంచుచున్నాడని యర్థము. దానినుండి సమస్తభూతములు పుట్టుచున్నవి.]

మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహమ్
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత!

(బ్రహ్మ) విపులమైన (మహత్) ప్రకృతి, (మమ) నాయొక్క; (యోనిః) ఉత్పత్తిస్థానము-నేను జగత్తును ఉత్పత్తిచేయు స్థానము-(అహం) నేను, (తస్మిన్) ఆ మహత్తు నందు (గర్భం) గర్భమును, (దధామి) ఉంచుచున్నాను. హేభారత! (తతః) దానినుండి (సర్వభూతానాం) సర్వభూతములయొక్క (సంభవః) పుట్టుక, (భవతి) అగుచున్నది.

అవ్యయుడైన క్షేత్రజ్ఞునకు సుఖదుఃఖాదులతో సంబంధము ఎట్లు కలుగుచున్నదన :

సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః
నిబధ్నంతి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్. 5

హేమహాబాహో, (సత్వం) సత్వము (రజః) రజస్సు (తమః) తమస్సు, (ఇతి) అను మూడైన, (ప్రకృతిసంభవాః) ప్రకృతివలనపుట్టిన (గుణాః) గుణములు, (దేహే) దేహమందు, (అవ్యయం) నాశరహితుడైన, (దేహినం) క్షేత్రజ్ఞుని (నిబధ్నంతి) కట్టివేయుచున్నవి.

ఈ మూడు గుణములలో సత్వగుణము సుఖముతోను జ్ఞానముతోను దేహిని బంధించును. కనుక అది యుత్తమమైనది.

తత్ర సత్వం నిర్మలత్వాత్ప్రకాశక మనామయమ్
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ! 6

(హేఅనఘ!) ఓపాపరహితుడా (తత్ర) ఆమూడింటిలో, (సత్వం) సత్వగుణము, (నిర్మలత్వాత్) నిర్మలమైన

దగుటవలన (ప్రకాశకం) ప్రకాశింపచేయునదియై, (అనామయం) నిరుపద్రవమైనదై, (సుఖసంగేన) సుఖముతో సంపర్కముచేతను (జ్ఞానసంగేన) జ్ఞానముతో సంపర్కముచేతను (బధ్నాతి) కట్టుచున్నది.

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్. 7

హేకౌంతేయ! (తృష్ణాసంగసముద్భవం) ఆశ, ఆసక్తి అను వానివలన పుట్టినట్టి, (రజః) రజోగుణమును, (రాగాత్మకం) అనురక్తియే స్వరూపముగాగలదానిగా, (విద్ధి) తెలిసికొనుము. (తత్) అది, (దేహినం) దేహిని, (కర్మసంగేన) కర్మ సంపర్కముతో, (నిబధ్నాతి) కట్టుచున్నది.

తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత! 8

హేభారత! (సర్వదేహినాం) సర్వప్రాణులకును, (మోహనం) మోహపెట్టునదియు-అవివేకములో పడవేయు (తమస్తు) తమోగుణమన్ననో, (అజ్ఞానజం) అజ్ఞానమువలన బుట్టినది, (తత్) అది, (ప్రమాదాలస్యనిద్రాభిః) ప్రమాదము, ఆలస్యము, నిద్ర అనువానితో (నిబధ్నాతి) కూర్చుచున్నది.

ఈ మూడు గుణములు ప్రతి వ్యక్తిలోను నుండును. ఒకొక్కప్పుడు మానవునిలో రజస్తమోగుణములకంటె హెచ్చుగా సత్త్వగుణ ముండవచ్చును. మరియొకప్పుడు రజో

గుణము మిగిలిన రెండింటికంటెను హెచ్చుగా నుండ వచ్చును. ఇంకొకప్పుడు సత్త్వరజస్సులకంటె తమస్సు హెచ్చుగానుండవచ్చును. ఇట్లేది వృద్ధిలోనున్న అప్పుడా గుణ సంబంధమైన వ్యాపారము బయలుదేరును. 10 అట్లే ఒకని జీవితములో మొత్తముపైన నేగుణము ప్రధానముగా నున్న వా డా గుణము ప్రధానముగా కలవాడని చెప్పబడు చున్నాడు. ఈ మూడుగుణములు వృద్ధిలోనున్నప్పుడు వాని వాని లక్షణము లెట్లుండుననః

సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత. 12

(యదా) ఎప్పుడు, (అస్మిన్) ఈ, (దేహే) దేహ మందు (సర్వద్వారేషు) శ్రోత్రాదిసమస్తద్వారములయందు (ప్రకాశః) అంతఃకరణముయొక్క వికాసమునదగు (జ్ఞానం) జ్ఞానము (ఉపజాయతే) పుట్టునో, (తదా) అప్పుడు (సత్త్వం) సత్త్వగుణము, (వివృద్ధం) వృద్ధిపొందినది, (ఇత్యుత) అని యును (విద్యాత్) తెలిసికొనవలయును.

లోభప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా
రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ! 12

హేభరతర్షభ! (లోభః) లోభము, (ప్రవృత్తిః) సామాన్యమైనచేష్ట, (కర్మణాం) పనులయొక్క, (ఆరంభః) ప్రారంభము, (అశమః) విశ్రాంతిలేకుండ హర్షరాగాది ప్రవృత్తి, (స్పృహా) కోరిక—(ఏతాని) ఇవి, (రజసి) రజో

గుణము, (వివృద్ధే) వృద్ధిపొందిన దగుచుండగా (జాయంతే) పుట్టుచున్నవి.

అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ
తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన! 13

హే కురునందన (అప్రకాశః) అవివేకము, (అప్రవృత్తిశ్చ) ఏపనియు చేయకుండుట, (ప్రమాదః) పొరపాటు, (మోహఏవచ) మూర్ఖ్యము, (ఏతాని) ఇవి, (తమసి) తమో గుణము, (వివృద్ధే) వృద్ధిపొందిన దగుచుండగా, (జాయంతే) పుట్టుచున్నవి.

[మానవాచరణములో నీగుణము లెట్లుండునో యీక్రింది యుదాహరణమువలన తెలిసికొనవచ్చును.

ఒకడు పేదలకు రోగచికిత్సాలయమును నిర్మించునను కొందము. అట్లునిర్మించు సద్బుద్ధి సత్వగుణమువలన కలిగినది. నిర్మించువని రజోగుణమువలన కలిగినది. ఆనిర్మించుటలో నేమైన పొరపాట్లు జరుగుచో నవి తమోగుణము వలన కలుగును.]

మానవుడు సత్వగుణము వృద్ధిలోనుండగా మరణించుచో దేవాదిలోకములలో జన్మించును. రజోగుణమువృద్ధిలోనుండగా మరణించుచో మనుష్యలోకములో జన్మించును. తమోగుణము వృద్ధిలోనుండగా మరణించుచో తిర్యగ్జంతువులలో జన్మించును. 14, 15.

పుణ్యకర్మలు చేయుటవలన సాత్త్వికఫలము కలుగును -అనగా జ్ఞానము, చిత్తనైర్మల్యజనితమయిన సుఖము ఏర్పడును. రజోగుణసంబంధమగు రాగాదిమూలకమైన పనిచేయుటవలన దుఃఖము కలుగును. తమోగుణకార్యము వలన అజ్ఞానము కలుగును. 16

ముక్తిని పొందవలయు నన్నచో రజస్తమోగుణ కార్యము పూర్తిగా నశింపవలెను. సత్త్వగుణము వృద్ధిచెంది యది ఆత్మజ్ఞానములో పరిణమించుచో మోక్షముకలుగును. అదియే త్రిగుణాతీతావస్థ. ఇది యెప్పుడు కలుగుననగా: గుణములు చేయుపనులకు కర్తలు గుణములేకాని 'నేను' కానని గుర్తించి గుణములకు పైనుండి సాక్షీభూతుడైన ఆత్మను దర్శించినపుడే కలుగును. 19

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి. 19

అట్లు దర్శించినవానికి సుఖదుఃఖములందు, మానావమానములయందు సమత్వము కలుగును. 24 ఇట్టి గుణాతీతావస్థ కల్గుటకు అచంచలభక్తితో పరమేశ్వరుని సేవించుటయే మార్గము.

—(•••)—

# పంచదశాధ్యాయము

—:o:—

## పురుషోత్తమప్రాప్తియోగము

[ఈ యధ్యాయములో పరమేశ్వరుడు ఆత్మతత్త్వమును తెలుపుచున్నాడు. పరమేశ్వరతత్త్వమును తెలిసికొనవలయునన్నచో సంసారముమీద విరక్తి కలుగవలయును. కావున మొదటిశ్లోకములో నశ్వరమైన సంసారము వర్ణింపబడినది. ఇందు సంసారము అశ్వత్థవృక్షముతో పోల్చబడినది. "అశ్వత్థము" అనగా "రేపుండనిది" అనియు అర్థము కలదు. నిత్యము మారుచుండుటయు, నశించుటయు నీజగత్తుయొక్క లక్షణమగుటచే నీ శబ్దము భావగభీరమైనది. ఈసంసార వృక్షమునకు మూలము పైనున్నదట! అనగా : వ్యక్తావ్యక్తప్రకృతులు రెండింటికంటె నతీతమైన పరమాత్మనుండియే యది వచ్చినదని యర్థము. ఈవృక్షముయొక్క శాఖలు మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు మొదలైనవి. వీనివలన జగత్తు నానాత్వవిలసితమై యొప్పుచున్నది. ఈ యశ్వత్థ మనాదికాలమునుండియు కలదు. దీనికి వేదములే యాకులు. ఆకులెట్లు చెట్టును రక్షించునో యట్లే వేదము ధర్మాధర్మములను ప్రదర్శించు నదియై లోకులను చక్కని స్థితిలో నుంచును. ఇదివఱకు వర్ణించిన అపరప్రకృతియే యీ యశ్వత్థము, ఈ క్షర ప్రకృతిలోనుండి దీని ననుభవించు క్షేత్రజ్ఞుడు దీనినుండి తన్ను వేరుగా తెలిసికొనుటయే

కాక తాను, ఈయశ్వత్థమునుగూడ స్వతంత్రులు కామనియు, తాను ప్రకృతి సంపర్కముచే నేర్పడిన పరమాత్మ ప్రతిబింబమే యనియు ప్రకృతితో తన్ను విడగొట్టుకొనుచో తనకు ప్రతిబింబరూపముపోయి బింబరూపమే నిలుచుననియు తెలిసికొనవలయును.

[ఇట్టి యశ్వత్థముయొక్క తత్త్వమెఱిగినవాడు దీనికి మూలమైన పరమాత్మతత్త్వము నెరుగును. అదియే వేద తత్త్వము. వాడు ఆత్మ త్రిగుణాతీతమని గుర్తించి మోక్షము నొందును.]

ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయం
ఛందాసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్. 1

(ఊర్ధ్వమూలం) పైని మూలము కలిగినట్టియు, (అధశ్శాఖం) క్రిందుగా కొమ్మలు గల్గినట్టియు, (అశ్వత్థం) అశ్వత్థ వృక్షమును, (అవ్యయం) ఆద్యంతములు లేనిదానిగా, (ప్రాహుః) చెప్పుచున్నారు, (యః) ఎవడు, (యస్య) ఏవృక్షము యొక్క, (పర్ణాని) ఆకులు, (ఛందాంసి) వేదములో (తం) ఆవృక్షమును (వేద) తెలిసికొనునో, (సః) వాడు, (వేదవిత్) వేదముల నెఱిగినవాడు.

[ఈ తత్త్వము గుర్తించినవానికి, సంసారము ప్రకృతి లోనిదనియు, నది నిరంతరము నశించుచు, పుట్టుచు, నుండు ననియు, తాను స్థిరుడను, అనశ్వరుడను అనియు, ప్రకృతి గుణములకు లోనకంటవనియు ననుభవములోనికి వచ్చును.]

అప్పుడు వాడు సుఖదుఃఖముల కతీతుడై పరమేశ్వర పదమును పొందును. 5 ఆస్థానము తేజోమయమైనను, సూర్యుడుకాని, చంద్రుడుకాని, దానిని ప్రకాశింపజేయుట లేదని తెలిసికొనవలయును. సూర్యచంద్రాదులు పరమేశ్వర మాయలోనివే యగుటచే నవి పరమేశ్వరుని ప్రకాశింప జేయలేవు. వానిప్రకాశమే యీ పరమేశ్వరునివలన కలుగు చున్నది. 12 ఆస్థానము నొకసారి పొందినవా డిక తిరిగిరాడు.

యద్గత్వా ననివర్తంతే తద్ధామ పరమం మమ. 6

జీవుడు పరమాత్మలో కలిసిపోవుట యెట్టిదనగా పరమాత్మ సూర్యునివంటివాడు. జీవుడు సూర్యబింబమువంటి వాడు. అనగా మాయయను జలములో కన్పట్టు ప్రతిబింబమే జీవుడు. జలమును తీసివైచినపుడు ప్రతిబింబముపోయి బింబములోనేలీనమగును. అట్లే జీవుడు మాయాసంపర్కమునువీడి పరమాత్మలోనే లీనమగును. మాయాసంపర్కమున్నంతకాలము జీవుడు పంచేంద్రియములను మనస్సును ఆశ్రయించుకొని సుఖదుఃఖము లనుభవించుచుండును. శరీరమును విడిచిపెట్టి మరియొక శరీరములోనికి జీవుడు పోయినప్పుడు వాయువు గంధమును తీసికొని వెళ్ళునట్లు మనస్సును ఇంద్రియములను తనతో తీసికొనిపోవును.

మ మైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః
మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి. 7

(సనాతనః) ఆదినుండియునున్న, (జీవలోకే) జీవుల యొక్క లోకమందలి, (జీవభూతః) కర్త, భోక్త యని చెప్ప బడుచున్నది, (మమ) నాయొక్క, (అంశఏవ) భాగమే. అది (ప్రకృతిస్థాని) ప్రకృతిలోనున్న, (మనష్షష్ఠాణి) మన స్సుతో ఆఱైన (ఇంద్రియాణి) ఇంద్రియములను (కర్షతి) లాగుచున్నది.

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్ 8

(ఈశ్వరః) దేహాంతఃకరణములకు ప్రభువైన జీవుడు, (యత్) ఎప్పుడు, (శరీరం) శరీరమును, (అవాప్నోతి) పొం దునో, (యత్) ఎప్పుడు, (ఉత్క్రామతి) శరీరమునువిడచి వెళ్ళునో, అప్పుడు, (వాయుః) వాయువు, (ఆశయాత్) పరి మళస్థానమైన పుష్పమునుండి, (గంధానివ) పరిమళములను వలె, (ఏతాని) ఈ యాఱింటిని, (గృహీత్వా) తీసికొని, (సంయాతి) వెళ్ళుచున్నాడు.

శ్రోత్రాదులు సహజముగా క్షేత్రజ్ఞునిలోనివి కావు. శరీరములోనివైన వీనిని అక్షరుడు గ్రహించుటయే అవివేక మును పొందుట; వీనినుండి అక్షరుడు భిన్నుడని జ్ఞానులు మాత్రమే తెలిసికొనగలరు. వారు శ్రోత్రాదీంద్రియకర్మ లన్నియు వానివే యనియు, వాని యనుభవమును, వానిదే యనియు భావించి తాము నిస్సంగముగా నుందురు. ఇట్లు అక్షరుని నిస్సంగునిగా యోగులు మాత్రమే ప్రయత్నముచే

తెలిసికొందురు. 10-11'అకృతాత్మ'లైనవారు అనగా తపస్సు చేతను, ఇంద్రియనిగ్రహముచేతను, అంతఃకరణమును పరిశుద్ధము చేసికొననివారు, దుశ్చరిత్రులయినవారు, ప్రయత్నించినను తెలిసికొనజాలరు.

[పరమేశ్వరుడు పరిపూర్ణుడు. పూర్ణమైనదానిలో భాగములను చేయుటకు తావులేదు. అట్టిచో "జీవుడునాలో భాగము" (అంశము) అని పరమేశ్వరుడేల చెప్పినాడన: అవిద్యయనెడు మాయ ఉపాధిగాగల పరమేశ్వరుని ఏకదేశమే అంశముగా నున్న ట్లూహింపబడినది.

[పరమేశ్వరుని క్షరప్రకృతి యొకపురుషుడని భావింపుడు. ఈ క్షరు డుత్పత్తియగుటకు కారణభూతమైన జీవభూతమైన, బీజభూతమైన అక్షరప్రకృతి మఱొకపురుషుడని భావింపుడు; ఈ రెంటిలో మొదటివానికి ఆధిపత్యముచేతను ప్రతిబింబ భూతమైన రెండవదానికి బింబత్వముచేతను పరమాత్ముడు ఆధారభూతు డగుచున్నాడు. ఆతడులేనిచో, లేదా అతని ఇచ్ఛయేలేనిచో. క్షరాక్షరపురుషు లిద్దరును లేరు. ఇట్లు సర్వాధారమై సర్వాతీతుడైన యాపురుషుడే పురుషోత్తముడని చెప్పబడును.]

యస్మాత్ క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః. 18

(యస్మాత్) ఏ హేతువువలన (అహం) నేను, (క్షరం) అశ్వత్థమనెడు-నశ్వర ప్రకృతిని-(అతీతః) అతిక్రమించియు

న్నానో, (అక్షరాదపిచ) అక్షరపురుషుడైన క్షేత్రజ్ఞునికం టెను (ఉత్తమః) అధికుడనో, (అతః) ఈ హేతువువలన (వేదే) వేదమందును, (లోకేచ) లోకమందును, నేను (పురుషోత్తమః) పురుషోత్తముడని, (ప్రథితః) ప్రసిద్ధుడనైనాను.

[ఇక్కెవ్వడు పురుషోత్తమతత్త్వమును తెలిసికొనునో వాడు క్షరాక్షరములు రెంటికిని ఆధారభూతమైన పురుషోత్తముడే సత్యస్వరూపమని తెలిసికొని యంతటను ఆ పరమాత్మనే దర్శించుచు, పరమేశ్వరుని యథార్థసేవ చేయుచు మోక్షమును పొందును.]

—(...)—

# షోడశాధ్యాయము

---

## దైవాసుర సంపద్విభాగయోగము

అంతఃకరణసంస్కారము లేనివారు ప్రయత్నించినను కూడ ఆత్మతత్త్వము నెరుగజాలరని ఇదివరకు (15–11) చెప్పబడినది. అంతఃకరణశుద్ధి లేనివారెట్లు ప్రవర్తింతురో ఈ యధ్యాయములో చెప్పబడుచున్నది. తొమ్మిదవ అధ్యాయములో ఆసురప్రకృతి కలవారు నన్ను సేవింపరని భగవానుడు చెప్పియున్నాడు. ఆ యాసురప్రకృతిలోని వారే యీ యధ్యాయములో వర్ణింపబడినవారు.

వారు నీచాతినీచమానవులని గుర్తింపవలయును. త్రిగుణాతీతులగువారికంటె చిత్తశుద్ధికై ఈశ్వరానుగ్రహ నిమిత్తమైకర్మలను చేయువారు తక్కువస్థితిలోనే యున్నారు. వారికి క్రమముగా మోక్షము వచ్చును. వారికంటెను కామములను పూర్తిగావీడజాలక తమ వాంఛలతృప్తికై శాస్త్రీయమైన సాధనములనే యవలంబించుచు నధర్మముల నాచరింపక ధర్మములనే యాచరించువారు తక్కువవారు. వీరికి స్వర్గాది పుణ్యలోకములును సుఖవంతములైన జన్మములును కలుగును. ఈయధ్యాయములో వర్ణింపబడిన రాక్షసప్రకృతిలోనివారు పైమూడుతరగతులలో దేనికిని చెందరు. వీరికి నరకమేగతి. వీరు కామక్రోధాహంభావాది వశులై వేదశాస్త్రములలోని

విధినిషేధములను పాటింపక ఇచ్ఛవచ్చినట్లు ప్రవర్తించుచుం దురు. ఈరాక్షస ప్రకృతిని వర్ణించుటకు పూర్వము పరమే శ్వరుడు దైవప్రకృతిని వర్ణింపుచున్నాడు.

అభయం సత్వసంశుద్ధిః, జ్ఞానయోగవ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ, స్వాధ్యాయ స్తప ఆర్జవం. 1
అహింసా సత్య మక్రోధ, స్త్యాగశ్శాంతిర పైశునం
దయా భూతే ష్వలోలుత్వం మార్దవం హ్రీ రచాపలం. 2
తేజః క్షమా ధృతిః శౌచ మద్రోహో నాతిమానితా
భవంతి సంపదం, దైవీ మభిజాతస్య భారత! 3

ఓ భారతా! దేనివలనను భయపడకుండుట, అంతః కరణశుద్ధి, ఆత్మాదిపదార్థముల జ్ఞానము కలిగియుండుట, చిత్తైకాగ్రత అను రెంటియందును నిష్ఠ, శక్తిననుసరించి దానము చేయుట, బాహేంద్రియములను నిగ్రహించుట, దేవతలను పూజించుట, వేదాధ్యయనము, తపస్సు, ఋజు ప్రవర్తన, అహింస, సత్యము, క్రోధము లేకుండుట, త్యాగము, శాంతి, ఇతరులదోషములను ప్రకటింపకుండుట, భూతదయ, విషయాసక్తి లేకుండుట, హృదయమార్దవము, సిగ్గు, వ్యర్థ ముగా నేపనియు చేయకుండుట, నేర్పరితనము, కష్టములను గల్గించువారిపై క్రోధము లేకుండుట, ధైర్యము, పరిశుద్ధి, ఎవరికిని ద్రోహము చేయకుండుట, తన్నుగురించి హెచ్చుగా భావించుకొనకుండుట-ఇవి దైవసంపద ననుసరించి పుట్టిన వారి కుండును.

దంభోదర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవచ
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపద మాసురీం. 4

ఓ పార్థా! తాను ధర్మముచేసినట్లు ప్రకటించుకొనుట, విద్యాధనబంధ్వాదులవలన గర్వము కలిగి యుండుట, తాను గొప్పవాడని భావించుట, పరుషవాక్యములను మాట్లా డుట, అజ్ఞానము-ఇవి ఆసురసంపదననుసరించి జన్మించినవారి కుండును.

దైవసంపదలోనున్నవాడు క్రమముగా ముక్తినిపొం దును. ఆసురసంపదలోనివాడు బద్ధుడగును, ఓ పార్థ! నీవు దైవసంపదనే యనుసరించి జన్మించినావు. కావున విచారింప కుము.5

రాక్షస సంపదలోని వా రెట్లుందు రనగా:

నశౌచం నాపిచాచారో న సత్యం తేషు విద్యతే. 7

(తేషు) వారియందు. (శౌచం) శరీర వాఙ్మనశ్శౌచ ములు, (న) ఉండవు, (ఆచారశ్చాపి) శిష్టాచారముగూడ, (న) లేదు, (సత్యన) సత్యముకూడ లేదు.

ఈ రాక్షసప్రకృతిలోనివారు జగత్తంతయు ప్రకృతి చేతనే నడచుచున్నదనియు పరమేశ్వరుడనువాడు లేడనియు నుడువుదురు.

అసత్య మప్రతిష్ఠంతే జగదాహు రనీశ్వరమ్. 8

(తే) వారు, (జగత్) జగత్తును, (అసత్యం) సత్యము లేనిదానినిగాను-నేమెట్లు అసత్యమే పల్కుచు కాలముగడు

పుచున్నారో యట్లే ఎల్లరు నసత్యమునే పల్కుచున్నార నియు, అసత్యము పల్కనివాడు లోకములో బ్రతుకజాలడ నియు వారు చెప్పుదురు. (అప్రతిష్ఠం) జగత్తుధర్మమే ఆధార ముగా కలది కాదనియు, (అనీశ్వరం) ఈశ్వరుడు లేనిదనియు, (ఆహుః) చెప్పుచున్నారు.

ఇట్టి దృష్టికలవారై వారు లోకనాశమునకు పూను దురు. అనేక క్రూరకార్యములు చేయుదురు.

ఆశాపాశశతై ర్బద్ధాః కామక్రోధపరాయణాః
ఈహంతే కామభోగార్థ మన్యాయేనాఽర్థసంచయాన్.12

వారు (ఆశాపాశశతైః) ఆశలనెడు పాశములయొక్క శతములచేత, (బద్ధాః) కట్టబడినవారై, (కామక్రోధపరా యణాః) కామక్రోధములే ముఖ్యమైన ఆశ్రయముగాగల వారై, (కామభోగార్థం) కామముల ననుభవించుటకొఱకు, (అన్యాయేన) చౌర్యము, మోసము మొదలైన అన్యాయ మార్గములచేత, (అర్థసంచయాన్) అర్థసంపాదనములను, (ఈహంతే) కోరుచుందురు.

వా రనేకపాపకృత్యములు చేయుచు కామతృప్తిని గలిగించుకొనుటయేగాక ఇతరులను నాశముచేయుటకుగూడ యత్నింతురు. ఇంత మహాపాపు లయ్యును వారు మాకుసాటి యెవరని విఱ్ఱవీగుదురు.

అసౌ మయా హత శ్శత్రుర్హనిష్యే చాపరానపి
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవా న్సుఖీ14

(మయా) నాచేత, (అసౌ) ఈ, (శత్రుః) శత్రువు, (హతః) చంపబడినాడు, (అపరానపిచ) ఇతరులనుగూడ, (హనిష్యే) చంపగలను, (అహం) నేను, (ఈశ్వరః) అధికారము గలవాడను, (అహం) నేను, (భోగీ) సుఖమనుభవించుచున్నవాడను, (అహం) నేను, (సిద్ధః) సంపన్నుడను, (బలవాన్) బలవంతుడను, (సుఖీ) సుఖవంతుడను-అని వారు భావింతురు-పలుకుదురు.

[ఒక డధికారములోనుండి ఇతరులకు సేవచేయకపైగా "నే నున్నతస్థితిలో నున్నాను, ఇతరులు నాకంటె తక్కువవారు" అను భావము కల్గియున్నచో వాడు రాక్షసప్రకృతిలోనివాడే. ఒక డైశ్వర్యము కల్గియుండి పేదలనుచూచి కనికరించి వారికి పెట్టకపోవుటయేగాక నే నేలోటును లేనివాడను, మీరు పూటకు గతిలేనివారు అని పల్కుచో వాడు రాక్షసప్రకృతిలోనివాడే.]

ఇట్టివారి గతి యేమనగా: వారిని నేను క్రూరములైన సింహవ్యాఘ్రాదుల యోనులయందు జన్మింపజేసెదను. వారాజన్మకాజన్మలో నింకను క్రిందికిపోవుచు నాకు దూరమై పోవుదురు. 19,20

ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని
మా మప్రాప్యైవ కౌంతేయ తతో యా న్త్యధమాం గతిమ్. 20

ఈవిధముగా కామక్రోధలోభమోహములచేత వారు తమ నాశనమును తెచ్చిపెట్టుకొనుచున్నారు. కావున నీ మూడింటిని మానవుడు విడవలయును.

వేదములయందు కొన్ని కార్యములు కర్తవ్యములుగా ఆదేశింపబడినవి. కొన్ని పనులు దోషములుగా నెంచబడి నిషేధింపబడినవి. ఈ విధినిషేధములను పరిగణింపక యెవడు ప్రవర్తించునో వాడే ఈ యాసుర ప్రకృతిలోనివాడు. వానికి మోక్షముగాని స్వర్గముగాని లభింపదు. 23

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ. 24

(తస్మాత్) ఆ హేతువువలన, (కార్యాకార్యవ్యవస్థితౌ) చేయతగినది, చేయకూడనిది యనువాని నేర్పాటు చేసికొనుటలో, (తే) నీకు, (శాస్త్రం) వేదము, (ప్రమాణం) జ్ఞానసాధనము.

[ఈయధ్యాయములోని ప్రత్యక్షరము పాఠకుడు జాగ్రత్తగా పరిశీలించి తనలో నాసురత్వ మేలేశమైన నున్నచో దానిని నశింపజేసికొనుటకును, దైవసంపదను వృద్ధిపొందించుకొనుటకును ప్రయత్నింపవలయును. దీనివలననే జ్ఞానోత్పత్తికి మూలసాధనమైన అంతఃకరణశుద్ధి కవకాశమేర్పడును.]

# సప్తదశాధ్యాయము

## శ్రద్ధాత్రయవిభాగయోగము

[పదునాల్గవ యధ్యాయములో తెలుపబడిన సత్వ రజ స్తమోగుణము లెట్టికార్యములను చేయించునో ఈయధ్యాయములో వివరింపబడినది.

సత్త్వగుణప్రధానులు దేవతలను పూజింతురు. రజోగుణప్రధానులు రాక్షసులను పూజింతురు. తమోగుణప్రధానులు పిశాచములను పూజింతురు.4 (ఏ గుణముగలవారి కాగుణముకలవారియందభిరుచి యేర్పడునని దీనివలన తెలియగలదు.) సత్వగుణప్రధానులు సత్సంకల్పములు నెరవేరుటకును, జ్ఞానము కల్గుటకును, తపస్సు చేయుదురు. రజోగుణముగలవారును, తమోగుణము కలవారును దంభాహంకారములతో శాస్త్రవిధికి విరుద్ధముగా తపస్సు చేయుదురు.5 ఈ మూడుగుణములు గలవారికి ఆహారములు రుచించుటలో గూడ భేదము గలదు.

ఆయు స్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః
రస్యాఃస్నిగ్ధాఃస్థిరా హృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః.8

(ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః) ఆయువును, సత్వగుణమును, బలమును, ఆరోగ్యమును, సుఖమును, వృద్ధిపొందించునట్టియు, (రస్యాః) రసముతో కూడుకొన్న

ట్టియు, (స్నిగ్ధాః) చమురుగల్గినట్టియు, (స్థిరాః) చిరకాలము చెడిపోకుండ నుండునట్టియు, (హృద్యాః) హృదయమునకు నింపుగా నుండునట్టియు, (ఆహారాః) ఆహారములు, (సాత్త్విక ప్రియాః) సాత్త్వికులకు ప్రియమైనవి – సత్త్వగుణమును వృద్ధిపొందించు నట్టివిగూడ నివియే యని తెలిసికొనవలయును.

కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః. 9

(దుఃఖశోకామయప్రదాః) దుఃఖమును, శోకమును, రోగమును, గల్గించునట్టి, (కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్ష విదాహినః) మిక్కిలి కారముగా నుండునట్టియు, పుల్లగానుండునట్టియు, ఉప్పగా నుండునట్టియు, వేడిగా నుండునట్టియు, మండునట్టియు, ఘాటుగా నుండునట్టియు, దాహమును గలిగించు నట్టియు, (ఆహారాః) ఆహారములు, (రాజసస్య) రాజసునకు, (ఇష్టాః) ఇష్టములు–ఇవియే రజోగుణముగలిగించు స్వభావముగలవి గూడను.

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్. 10

(యత్) ఏది, (యాతయామం) జాముక్రిందట–చాల కాలముక్రిందట–వండబడినదో, (గతరసం) నిర్వీర్యమైనదో, (పూతి) దుర్గంధముగలదో, (పర్యుషితం) పాసిపోయినదో, (ఉచ్ఛిష్టమపి) ఎంగిలియైనదో, (అమేధ్యంచ) అపవిత్రమై

నదో, (తత్)-ఆ (భోజనం) భోజనము, (తామసప్రియం) తామసులకు ఇష్టమైనది-ఇదియే తమోగుణమును వృద్ధి పొందించును కూడను.

తపస్సుకూడ మూడువిధములు: సాత్త్వికతపస్సు, ఫలాకాంక్షలేకుండ చేయబడును. అందు శారీరతపస్సు ఎట్టి దనిన:

దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే. 14

(దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం) దేవతలను, ద్విజులను గురువులను, ప్రాజ్ఞులను పూజించుట, (శౌచం) పరిశుద్ధి (ఆర్జవం) ఋజుప్రవర్తనము, (బ్రహ్మచర్యం) బ్రహ్మచర్యము (అహింసాచ) అహింస,-ఇవి-(శారీరం) శరీరసంబంధమైన, (తపః) తపస్సుగా (ఉచ్యతే) చెప్పబడును.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితంచ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. 15

(అనుద్వేగకరం) ప్రాణులకు దుఃఖమును గల్గింప నట్టియు (సత్యం) సత్యమైనట్టియు, (ప్రియహితంచ) వినుటకిం పుగా నుండునట్టియు-మేలు కలిగించునట్టియు-(యత్) ఏవా క్యముగలదో అదియు, (స్వాధ్యాయాభ్యసనంచైవ) వేదపఠన మును, (వాఙ్మయం) వాగ్రూపమైన, (తపః) తపస్సుగా, (ఉచ్యతే) చెప్పబడుచున్నది.

మనఃప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః
భావసంశుద్ధి రిత్యే త్తపో మానస ముచ్యతే. 16

(మనః ప్రసాదః) మనస్సును స్వచ్ఛముగా నుంచుకొనుట, (సౌమ్యత్వం) సాధుత్వముగానుండుట, (మౌనం) మనస్సును, పరిపరివిధములుగా పోనీయకుండుట, (ఆత్మవినిగ్రహః) ఇంద్రియనిగ్రహము, (భావసంశుద్ధిః) ఇతరులతో వ్యవహరించునపుడు కపటము లేకుండుట, (ఇత్యేతత్) అనునది (మానసం) మనస్సంబంధమైన, (తపః) తపస్సుగా, (ఉచ్యతే) చెప్పబడును.

[పైని తెల్పిన మూడువిధములైన తపస్సులును అత్యంతము ముఖ్యమైనవి. ఉత్తమ జీవితమునకు ఇదియే సంగ్రహ స్వరూపమని చెప్పవచ్చును.]

రజోగుణసంబంధమైన తపస్సు లోకములో సత్కారమును పొందవలెనను భావముతో చేయబడును. తన కేమియు నుపయోగింపకుండగను, ఇతరులకు నాశము కలుగవలయునను సంకల్పముతోను చేయబడినది తామసతపస్సు. 19

అట్లే దానము మూడు విధములు. అర్హుడైనవానికి తగిన సమయములో పుణ్యక్షేత్రాద్యుచిత ప్రదేశములలో నీయబడి తిరిగి వానివలన ఉపకారము నపేక్షింపకుండచేయు దానము సాత్త్వికదానము. 20 ప్రత్యుపకారమును కోరికాని కీర్తి మొదలైన ఫలములను కోరిగాని లోపల కష్టపడికాని చేయబడు దానము రాజసము. 21 దేశకాలపాత్రములనాలోచింపక అగౌరవపూర్వకముగా, అవమానపూర్వకముగా చేయబడు దానము తామసదానము. 22

# అష్టాదశాధ్యాయము

—...—

## మోక్షసన్న్యాసయోగము

[గడచిన పదునేడధ్యాయములో నున్న విషయములే యీ యధ్యాయములో సంగ్రహముగా చెప్పబడినవి. కొన్ని నూతనవిషయములును కలవు. ముఖ్యముగా నూతనాంశములనే నే నిందు వ్రాయుచున్నాను. మోక్షముకొఱకు సర్వము సన్న్యసింపవలయునని యిందు చెప్పబడుటచే నీ యధ్యాయమునకు మోక్షసన్న్యాసయోగమను పేరువచ్చినది.]

ఇంతవఱకు సన్న్యాసశబ్దము, త్యాగశబ్దము చాల చోట్ల ప్రయోగింప బడినవి. వానియర్థమేమని యర్జును డడుగును. భగవంతు డిట్లు సమాధానము చెప్పుచున్నాడు :

కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయోవిదుః
సర్వకర్మ ఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః. 2

(కామ్యానాం) స్వర్గాదివాంఛలతో చేయబడు అశ్వమేధాదికర్మల, (న్యాసం) విడిచిపెట్టుటను, (సన్న్యాసం) సన్న్యాసమునుగా, (కవయః) పండితులు, (విదుః) తెలిసికొనుచున్నారు. (విచక్షణాః) వివేకులు, (సర్వకర్మఫలత్యాగం) సంధ్యావందనాది సమస్తనిత్యకర్మలయొక్కయు, శ్రాద్ధాది సమస్తనైమిత్తిక కర్మలయొక్కయు, ఫలమును విడిచిపెట్టుటను (త్యాగం) త్యాగమునుగా, (ప్రాహుః) చెప్పుచున్నారు.

